శ్రీరస్తు.

# శ్రీ భగవద్గీతావచనము.




ఇది

మంగు వెంకటరంగనాథరావుచే ప్రకటింపఁబడియెను.





మొదటికూర్పు 1000.

1909

కాకినాడ:

శ్రీసరస్వతీముద్రాక్షరశాలయందు

క్రొత్తపల్లి సూర్యరావుచేత ముద్రితము.

వెల 0-6-0.

శ్రీరాములు.

# శ్రీభగవద్గీతావచనము.

## శ్రీభగవద్గీతామాహాత్మ్యప్రారంభము.

—భూదేవివాక్యము—

ఓస్వామీ! ప్రారబ్ధఫలము ననుభవించుచున్న మనుష్యులకు నీయం దచంచలభక్తి యెట్లు కలుగును?

శ్రీమహావిష్ణువు చెప్పుచున్నాఁడు.

ఓభూదేవి! ప్రారబ్ధఫలము ననుభవించువాఁడైనను శ్రీభగవద్గీతల నెల్లప్పుడు నాసక్తితోఁ బారాయణము చేయుపురుషుఁడు ముక్తుఁడై సుఖియై భూమియందుఁ దాను జేయుకర్మలచేత బద్ధుండుగాక యుండును. మహాపాపములు చేసినవాఁడైనను శ్రీభగవద్గీతలను బారాయణము చేసినయెడలఁ దామరాకున నీళ్ళంటనిరీతిగాఁ బాపములచేత వాఁడెప్పుడు స్పృశింపఁబడఁడు. శ్రీభగవద్గీతలపుస్తక మెచ్చటనుండునో యెచ్చట నాపుస్తకము పారాయణము చేయఁబడునో యచ్చటచ్చటఁ బ్రయాగ మొదలయిన సమస్తపుణ్యతీర్థము లున్నవి. అచ్చోటులలోనే సమస్తదేవతలును ఋషులును యోగులును దేవసర్పములును గోపాలగోపికలును వైకుంఠద్వారపాలకులును నారదమహామునియు నుద్ధవుఁడును సహాయులయి యుందురు. ఓభూదేవీ! యెచ్చటగీతాశాస్త్రపఠనమును నర్థవిచారమును నుపదేశమును వినుటయును జరగుచున్నవో యచ్చట నేను సిద్ధముగా నుందును. శ్రీభగవద్గీతలే నాకాశ్రయము. అవియే నాకు నివాసస్థానము. గీతాశాస్త్రము నాశ్రయించుటచేతనే నేను మూఁడులోకములను బరిపాలనచేయుచున్నాను. తాత్పర్యరూపముగా నిత్యమై బ్రహ్మస్వరూపమై నాశరహితమై యుండు గీతాశాస్త్రము మోక్షవిద్య యనుటకు సందేహము లేదు. అతా

త్పర్యమునే చిదానందస్వరూపుఁడైన శ్రీకృష్ణు లర్జునునుద్దేశించి యుపదేశమును జేసిరి. ఈగీతాశాస్త్రము వేదత్రయస్వరూపముగాను బరమానందస్వరూపముగాను దత్త్వజ్ఞానప్రతిపాదకముగాను నున్నది; యేమనుష్యుఁడు ప్రతిదినమందు నచంచలమనస్సుతో గీతాశాస్త్రముయొక్క పదునెనిమిదియధ్యాయములను పారాయణము చేయునో వాఁడు బ్రహ్మజ్ఞానమును బొంది తద్వారా మోక్షమును బొందును. శ్రీగీతాశాస్త్రమును బ్రతిదినముఁ బూర్తిగాఁ బారాయణము చేయుటకు సామర్థ్యము లేక సగమును బారాయణము చేసినవానికి గోదానపుణ్యఫలము ప్రాప్తమగుటకు సందేహములేదు. ఈగీతాశాస్త్రములో మూఁడవభాగమును బ్రతిదినముఁ బారాయణము చేసినవానికి గంగాస్నానఫలము లభించును. ఆఱవభాగమును బారాయణము చేసినవాని కగ్నిష్టోమము చేసినఫలము సిద్ధించును. భక్తిగలవాఁడయి ప్రతిదినము నొకయధ్యాయమును బారాయణము చేసినవాఁడు రుద్రలోకమును బొంది యచ్చటి ప్రమథగణములతోఁ జేరియుండును. అధ్యాయములో నాల్గవభాగము నెవ్వఁడు ప్రతిదినముఁ బారాయణముచేయునో యట్టిపురుషుఁడు భూమియందు మన్వంతరమువఱకుఁ జిరంజీవి యైయుండును. గీతాశాస్త్రములోఁ బదిశ్లోకములైన లేక యేడైన నయిదైన నాలుగైన మూఁడైన రెండైన నొక్కటైన శ్లోకములో సగమైనఁ బ్రతిదినముఁ బారాయణము చేసినపురుషుఁడు చంద్రలోకమును బొంది యచ్చట నిశ్చయముగాఁ బదివేలసంవత్సరములు నివసించును. గీతాశాస్త్రమును బారాయణముచేయుచు మృతినొందిన పురుషునకు దేవత్వము ప్రాప్తమగును. ఈశ్రీభగవద్గీతాశాస్త్రమును బారాయణ చేసినపురుషుఁడు దుర్లభమైన మోక్షమునొందును. మరణకాలమునందు గీతాస్మరణముచేసిన పురుషుఁ డుత్తమగతిని బొందును. గీతాశాస్త్రమును వినుటయందాసక్తి గలపురుషుఁడు మహాపాపియైనను వైకుంఠలోకమును బొంది శ్రీమహావిష్ణువుతోఁగూడ నానందించును. ప్రతిదినమును నిత్యనైమిత్తికకర్మలు చేయుచు నెవఁడు గీతాశాస్త్రార్థమును

ధ్యానముచేయుచున్నాఁడో వాఁడు జీవన్ముక్తుఁడై దేహమును విడిచిన వెనుక మోక్షము నొందును. జనకుఁడు మొదలయిన యనేకమంది రాజులు గీతాశాస్త్రము నాశ్రయించి సమస్తపాపములను బోఁగొట్టుకొనినవారలై లోకమునందు యశస్సంపన్నులై మోక్షము నొందినవారైరి. ఈగీతాశాస్త్ర మాహాత్మ్యమును విడిచిపెట్టి యీగీతాశాస్త్రమునుమాత్రము పారాయణము చేసినవారికి శాస్త్రోక్తమైన ఫలము లేకపోవుటయే గాక ప్రయాసమాత్రమే కలుగును. ఈగీతామాహాత్మ్యముతోఁగూడ గీతాశాస్త్రమును పారాయణము చేసినవారు పైనఁజెప్పినఫలమును బొందుటయేకాక మోక్షమును గూడఁ బొందుచున్నారు.—సూతుఁడు చెప్పుచున్నాఁడు.—ఓశౌనకాదులారా! నాచేతఁ జెప్పఁబడిన పురాతనమైన యీగీతాశాస్త్రమాహాత్మ్యమును గీతాశాస్త్రపారాయణాంతమునం దెవఁడు పారాయణము చేయుచున్నాఁడో వాఁడాఫలమును బొందుచున్నాఁడు.

ఇట్లు వరాహపురాణమునందుఁ జెప్పఁబడియుండు శ్రీగీతాశాస్త్రమాహాత్మ్యము ముగిసెను.

శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీరాములు.

శ్రీభగవద్గీతావచనప్రారంభము.

## —౧. అర్జునవిషాదయోగమను ప్రథమాధ్యాయము.—

ధృతరాష్ట్రుఁ డడుగుచున్నాఁడు:—ఓసంజయా! పుణ్యభూమియైన కురుక్షేత్రమునందు నాకొమారులైన దుర్యోధనాదులును పాండుకుమారులైన ధర్మరాజాదులును యుద్ధమునకు సన్నద్ధులై యేమిచేసిరి? సంజయుఁడు చెప్పుచున్నాఁడు. ఓధృతరాష్ట్రమహారాజా! రాజైన దుర్యోధనుఁడు వ్యూహముగాఁ బన్నియుండఁ బాండవసేనను జూచి ద్రోణాచార్యులయొద్దకుఁ బోయి యొకమాట చెప్పెను. ఓయి! ఆచార్యా! నీశిష్యుఁడైన ధృష్టద్యుమ్నునిచేత యుద్ధప్రారంభమునకువ్యూ

హాముగాఁ బన్నియుండు పాండవసేనను జూడుము. యుద్ధరంగమునందు భీమార్జునులకు సమానులైనట్టియు గొప్పధనుష్మంతు లైనట్టి శూరు లున్నారు. వారెవరనిన ; యుద్ధసన్నద్ధుఁడైన విరాటుఁడును మహారథికుఁ డైనద్రుపదుఁడును మఱియు ధృష్టకేతు వనెడిరాజును జేకితానుఁడును బరాక్రమశాలి యైనకాశీరాజును బురుజిత్తనెడిరాజును గుంతిభోజుఁడును నరశ్రేష్ఠుఁ డైనశైబ్యుఁడును మఱియు వీరుఁడైన యుధామన్యుఁడుఁ బరాక్రమశాలి యైనయుత్తమౌజుఁడు నభిమన్యుఁడు నుపపాండవులు నున్నారు. వీరందఱు మహారథికులే. ఓయి ద్రోణాచార్యా ! మనసేనకు రక్షకులను నీకు జ్ఞాపకార్థమై యింకను వివరించుచున్నాను. అందులో శ్రేష్ఠులైనవారిని వినుము. వారెవ రనిన ; నీవును భీష్ముఁడుఁ గర్ణుడును గృపాచార్యుఁడు నశ్వత్థామయు వికర్ణుఁడును సోమదత్తునికుమారుఁ డైనభూరిశ్రవుఁడు నింక ననేకమంది శూరులును నానాస్త్రశస్త్రములయందుఁ బ్రవీణతగలవారై నానిమిత్తము తమతమ ప్రాణములయం దభిమానము విడిచిపెట్టినవారు గా నున్నారు. ఈమనసేన భీష్ములచేత సంరక్షింపఁబడి యమితమై యున్నది. మన శత్రుసేన భీమునిచేత సంరక్షింపఁబడి మితముగా నున్నది. ఓద్రోణాచార్యా! మీరందఱును వారివారి కేర్పఱచిన స్థానములలోనుండి మనసేనానాయకుఁ డైనభీష్ముని సంరక్షణ చేయవలెను. అని దుర్యోధనమహారాజు చెప్పఁగానే పరాక్రమశాలి యగుకురుశ్రేష్ఠుఁ డైనభీష్ముఁడు దుర్యోధనున కుత్సాహమును బుట్టించుచు సింహనాదము చేసి శంఖమును బూరించెను. ఇట్లుభీష్మాచార్యులు చేయఁగానే కౌరవసైనికులు శంఖములు భేరులు మొదలయిన యుద్ధసన్నద్ధవాద్యములను వాయించిరి. ఆశబ్ద మొకపెద్దమ్రోఁతగా నుండెను. పిదపఁ దెల్లనిగుఱ్ఱములను గట్టియుండు గొప్పరథములో నున్నకృష్ణార్జునులును దమతమ శ్రేష్ఠములైన శంఖములఁబూరించిరి. హృషీకేశుఁడు దివ్యమైన పాంచజన్యము నర్జునుఁడు దేవదత్తమును బూరించిరి. మఱియు భయంకరవ్యాపారము గలభీముఁడు పౌండ్రమనెడి తనశంఖమును ధర్మరా జ

నంతవిజయమనెడి శంఖమును నకులసహదేవులు సుఘోషమణిపుష్పక ములనెడి శంఖములను బూరించిరి. మఱియు శ్రేష్ఠమయిన ధనుస్సుగల కాశీరాజును మహారథికు లయినశిఖండియు ధృష్టద్యుమ్నుఁడును విరాటరాజును మహావీరుఁడైనసాత్యకియు వేఱువేఱుగా శంఖములను బూరించిరి. ఓధృతరాష్ట్రమహారాజా! మఱియు ద్రుపదరాజు నుపపాండవులు భుజబలముఁగల యభిమన్యుఁడు మొదలుగాఁ గలసేనానాయకులు వేఱువేఱుగా శంఖములను బూరించిరి. ఇట్లు కృష్ణార్జునులు మొదలగుపాండవసైనికులు చేసిన శంఖధ్వనులు భూమియు నాకాశమును నిండి దుర్యోధనాదుల గుండెలు పగులఁగొట్టెను. అటుతరువాత నర్జునుఁడు వరుసగా నిలిచి యుండి బాణములువేయుట కుద్యుక్తులైయున్న కౌరవులను జూచి కృష్ణమూర్తి నుద్దేశించి యిట్లు చెప్పెను. ఎట్లన; ఓయి యచ్యుతా! యీయుద్ధరంగమందు నేనెవరితో యుద్ధము చేయఁదగినదో వార్లనుజక్కఁగాఁ జూడవలయును గాన నీరెండుసేనలమధ్యమున సారథమును నిలుపుము. దుర్మార్గుం డగుదుర్యోధనునకుఁ బ్రీతి చేయ నిచ్ఛయించినవారై యుద్ధము చేయుట కెవరెవరు సన్నద్ధులై వచ్చియున్నారో వారలను నేను జూడఁగోరుచున్నాను. సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ జెప్పుచున్నాఁడు. ఈప్రకార మర్జునుఁడు చెప్పఁగా శ్రీకృష్ణుఁ డుభయసేనామధ్యమందు రథము నిలిపెను. తరువాత నర్జునుని జూచి యోయి యర్జునా! కౌరవసేనను జూడు మని భీష్మద్రోణులయెదుట శ్రీకృష్ణుఁడు చెప్పెను. పిమ్మట నర్జునుఁడు రెండుసేనల యందు నున్నపినతండ్రులను బెద్దతండ్రులను దాతలను గురువులను మేనమామల నన్నదమ్ములను గొడుకులను మనుమలను మిత్రులను మామలను స్నేహితులను జూచెను. ఇట్టిబంధువుల నందఱను జూచి మిగుల జాలినొంది దుఃఖించి శ్రీకృష్ణమూర్తి నుద్దేశించి యిట్లు పలికెను. ఏలాగు ననఁగా; ఓయి కృష్ణా! యుద్ధము చేయుట కెదురొని సమీపించి యున్నయీబంధులను జూచి నాయవయవములు విలవిలఁబోవుచున్నవి. నోరెండుచున్నది. దేహము వణుఁకుచున్నది. వెం

డుృకలు గరిపోడుచున్నవి, మఱియు గాండీవము చేతిలోనుండి జాఱిపోవుచున్నది. చర్మమధికతాపము నొందుచున్నది. మనస్సుభ్రమిం చుచున్నది. ఇంకను రథముమీఁదఁ జక్కఁగాఁ గూర్చుండుట కశక్తుఁడ నై యున్నాను. ఓ కేశవా! నా కపశకునములు కనఁబడుచున్నవి. ఈ యుద్ధములో బంధుమిత్రులను జంపి తరువాత నే నేమిసుఖము పొం దఁగలను. ఓయి కృష్ణ! జయమును గాని రాజ్యమును గాని సుఖము ను గాని నేను గోరలేదు. వీరల నందఱను జంపిన పిదప రాజ్యమెం దుకు సుఖమెందుకు జీవించుటవలన నేమిప్రయోజనము! ఎవరికొఱ కై మనము సుఖమును రాజ్యమును భోగములను గోరుచున్నామో యట్టివారే యర్థమును బ్రాణములను విడిచి యుద్ధసన్నద్ధులై వచ్చి యున్నారు. అప్రకారమే యాచార్యులును దండ్రులును బుత్రులును దాతలును మేనమామలు మామలు మనుమలు బావమఱఁదులు వి య్యంకులు వచ్చియున్నారు. ఓమధుసూదనా! నన్నుజంపుటకు వ చ్చిన వీరిని త్రైలోక్యరాజ్యపదవికి నైనను నేనుజంపఁగోరను. ఒక భూ మండలాధిపత్యముకొఱకై చంపుదునా! ఓజనార్దనా! యీదుర్యో ధనాదులను జంపిన మన కేమిప్రీతి గలుగును. మనలను జంపవచ్చిన ను వీరిని జంపినట్లయినఁ బాపమే వచ్చును. ఓయి మాధవా! బంధుజ నులతోఁగూడిన దుర్యోధనాదులను జంపుటకు మనము దగము. స్వ జనులను జంపి మనమేవిధముగా సుఖము గలవార మగుదుము. ఈ దుర్యోధనాదులు లోభముచేతఁ జెడినమనస్సు గలవారై కులక్షయము చేయుటచేఁ గలుగుపాపమును మిత్రద్రోహముచేయుటచేఁ గలుగుపా పమును దెలిసికొనలేరు. ఓయి జనార్దనా! కులనాశనము చేయుట చేఁ గలుగుపాపమును జక్కఁగాఁ జూచుచున్న మన మీపాపము నివ ర్తించుట కెట్లు ప్రయత్నము చేసికొనక యుండవచ్చును! వంశనాశ ము గలుగుటవలన ననాదియైన కులాచారములు నశించిపోవును, కుల ధర్మము నశించుటచేత నాకులము నధర్మము చుట్టుకొనును. ఓయి కృష్ణ! అందువలనఁ గులస్త్రీలు దోషయుక్త లగుచున్నారు, స్త్రీలు

దోషయుక్తులైరేని వర్ణసంకరము గలుగుచున్నది. ఈవర్ణసంకరము కులమును జెఱచినవారలకును గులమునకును నరకముఁ గలుగఁజేయును. ఈకులఘ్నులయొక్కయుఁ గులముయొక్కయుఁ బితృదేవతలు పిండోదకలోపముచేత నధోలోకమును బొందుచున్నారు. వర్ణసంకరము చేయునట్టి కులఘ్నులయొక్క యీదోషముచేత శాశ్వతములైన కులధర్మములు జాతిధర్మములు నశింపఁజేయఁబడుచున్నవి. ఓజనార్దనా! కులధర్మములు చెడిపోయినవారలకు నరకమందు వాసము గలుగుచున్నది. ఇది నిశ్చయము. ఇట్లు మనము వినుచున్నాము. ఏమియాశ్చర్యము! ఏమికష్టము! మహాపాపమును జేయుట కుద్యుక్తులమైతిమి! రాజ్యసుఖలోభముచేత బంధువులను గూడఁ జంపుట కుద్యుక్తుల మైతిమి! నిరాయుధుఁడనై ప్రతిఘటింపని నన్నాయుధపాణులైన దుర్యోధనాదులు యుద్ధమందు సంహరించిరేని నదియే నాకు మిక్కిలి క్షేమకరము. సంజయుఁడు చెప్పుచున్నాఁడు. ఓధృతరాష్ట్రమహారాజా! యీప్రకారముగా నర్జునుఁడు పలికి మహాదుఃఖాక్రాంతుఁడై ధనుర్బాణములను వదలి యుభయసేనలమధ్య నిలిపియుండిన రథమునం దూరక కూర్చుండెను.

ఇట్లుపనిషదర్థప్రమైనట్టియుఁ బరబ్రహ్మవిద్యయైనట్టియు భగవద్గీత లనెడుశ్రీకృష్ణార్జునసంవాదరూపమైన యోగశాస్త్రమునం దర్జునవిషాదయోగ మనుమొదటియధ్యాయము ముగిసెను.

శ్రీకృష్ణార్పణమస్తు.



## ౨. సాంఖ్యయోగమను రెండవయధ్యాయము.

సంజయుఁడు చెప్పుచున్నాఁడు. ఓధృతరాష్ట్రమహారాజా! యిట్లు దయాపరుఁడై కన్నీళ్ళు విడుచుచు దుఃఖాక్రాంతుఁడయిన యర్జునుని జూచి మధుసూదనుం డీవాక్యముఁ బలుకుచున్నాఁడు. ఎట్లనఁగా; ఓయి యర్జునా! యుద్ధమునకుఁ బ్రారంభింపఁబోవు నిట్టి విషమసమయమందు శూరులకు కనర్హమైనట్టియు స్వర్గమును బొందుటకు

విఘాతక మైనట్టియు నపకీర్తికిఁ గారణమైనట్టియు నీదుఃఖరూపమైన పిఱికితనము నీకెట్లుగలిగెను. ఓయి యర్జునా! నీవు భయముఁబొందకుము. అది నీకుఁ దగినది గాదు, తుచ్ఛమైనయీయధైర్యమును విడిచిపెట్టి యుద్ధమునకు లెమ్ము. అర్జునుఁడు చెప్పుచున్నాఁడు. ఓయి మధుసూదనా! పూజార్హులైన భీష్మద్రోణులనెదిరించి బాణములతోఁ బ్రతియుద్ధము నే నెట్లు సేయఁగలను. అర్థకాములైనగురువులను సంహరించి రక్తమిశ్రమయినభోగము లనుభవించుటకంటె మహానుభావులైనగురువులను సంహరింపక యీలోకమందు భిక్షాన్నము భక్షించుట శ్రేష్ఠముగా నున్నది. యుద్ధముఁ జేసితిమేని మనము శత్రువులైన దుర్యోధనాదులను జయింతుమో లేక వారే మనలను జయింతురో యీజయాపజయములు మనకుఁ దెలియవు. ఏదుర్యోధనాదులఁ జంపినవెనుక మనము చచ్చినమేలో యట్టిదుర్యోధనాదులు మనలనెదురుకొని యుద్ధసన్నద్ధులయి వచ్చియున్నారు. నే నిప్పుడు స్వాధీనము తప్పిన మనస్సుగలవాఁడను గాను ధర్మము తెలియనివాఁడనుగా నున్నాను. కనుక యిప్పుడు నే నేకార్యము చేయుట యుక్తమని నిన్నడిగెద. ఏకార్యము శ్రేయస్కరమో యట్టికార్యమును నాకు సెలవిమ్ము. నేను నీకు శిష్యుఁడను, నిన్ను శరణుపొందినవాఁడను. కనుక నన్ను శిక్షింపుము. నాయింద్రియములను శోషింపఁజేయుచున్న యీదుఃఖ మేకార్యముచేయుటవలన నివర్తించునో యట్టికార్యము నాకుఁ దెలియలేదు. భూమండలాధిపత్యము నింద్రత్వముగూడ నీదుఃఖమును బోఁగొట్టఁజాలవు. సంజయుఁడు చెప్పుచున్నాఁడు; ఓయి ధృతరాష్ట్రుఁడా! శత్రుసంహారకుఁ డయినయర్జునుఁడీప్రకారముగాఁ బలికి గోవిందుని జూచి యుద్ధముచేయ నని చెప్పి యూరకయుండెను. యుద్ధసన్నద్ధు లయినయుభయసేనలమధ్యమందు దుఃఖించుచున్న యర్జునుజూచి హృషీకేశుఁడు చిఱునవ్వుతో నిట్లు పలుకుచుండెను. ఏలాగునననిన:—నీవు దుఃఖింపఁదగనివారలను గూర్చి దుఃఖించితివి. పండితునివలెఁ బలుకుచున్నావు. ఆత్మానాత్మవివేకము కలవారు

మృతు లైనవారినిగుఱించి గాని జీవించియుండువారలనుగుఱించి గాని దుఃఖింపరు. నే నేమి నీ వేమి యీరాజు లందఱేమి యింతకుమును పూర్వమును లేకపోయినవారము గాము. ఇఁక నెప్పుడు లేకపోయెడు వారము గాము. మనమందఱము నిత్యులమై యుండువారము. దేహికి దేహమందు బాల్యము యౌవనము మునలితనము నెట్టివో దేహాంతరము పొందుటయు నట్టిదే గనుక విద్వాంసుఁ డీవిషయమునందు మోహమును జెందఁడు. ఓయి యర్జునా! సంయోగవియోగంబులు గలిగి యనిత్యము లైనవిషయములు శీతోష్ణసుఖదుఃఖముల నిచ్చునవి వాని నీవు సహింపుము. ఓ యర్జునా !సుఖదుఃఖములయందు సమానుఁడయి ధీరుఁ డయినయెవ్వని విషయసంబంధములు వేధింపవో యట్టిపురుషుఁడే మోక్షార్హుఁడు. అసత్పదార్థమునకు సత్త లేదు. సత్పదార్థమున కసత్త లేదు. తత్వజ్ఞానులచేత నీసదసత్తులయొక్క నిర్ణయము చేయఁబడినది. ఏవస్తువుచేత నీసమస్తజగత్తు వ్యాపింపఁబడియున్నదో యట్టివస్తువు నాశనములేనిదిగాఁ దెలియుము. వికారరహిత మైనయావస్తువును నాశనముచేయుట కెవ్వఁడు సమర్థుఁడుగాఁడు. నిత్యుఁడై నాశరహితుఁడయి ప్రమాణమునకు గోచరముగాని దేహికనిత్యములైన దేహములు వచ్చినట్లు చెప్పఁబడియున్నవి గనుక ఓయి యర్జునా! నీ విపుడు యుద్ధముచేయుము. దేహి చంపెడువాఁ డనియుఁ జచ్చెడు వాఁడనియు నెవరభిప్రాయపడుచున్నారో వారిద్దఱును మూఢు లని తెలియుము. దేహి యొకరినిజంపువాఁడుగాని యొకరిచేతఁ జంపఁబడువాఁడుగానికాఁడు. ఈదేహి పుట్టువాఁడుఁ గాఁడు చచ్చువాఁడుఁ గాడు. స్థిరరూపుఁడు. అనాది యైనవాఁడు కనుక దేహములు నశించునేగాని దేహి కెప్పుడును నాశములేదు. ఓయర్జునా ! యేపురుషుఁ డీయాత్మ నిత్యుఁడని యేకరూపి యని వికారరహితుఁ డని పుట్టువులేనివాఁ డని క్షయరహితుఁ డనియుఁ దెలిసికొనుచున్నాఁడో యట్టిపురుషుఁ డొకరి నెట్లు చంపును. మఱి యొకరిచేత నెట్లు చంపించును. మనుష్యుఁడు జీర్ణవస్త్రములను బాఱవైచి నూతనవస్త్రముల నేప్రకారము ధ

రించుచున్నాఁడో యాప్రకారమే శిథిలములైన దేహములను విడిచి యాత్మ నూతనము లయిన యితరశరీరములను గ్రహించుచున్నాఁడు. ఈయాత్మ నాయుధములు ఛేదింపఁజాలవు. అగ్ని దహింపఁజాలదు. ఉదకములు తడుపఁజాలవు. వాయువు శోషింపఁజేయఁజాలదు. ఈయాత్మ ఛేదింపఁదగనిదై దహింపఁదగనిదై తడుపఁదగనిదై శోషింపఁదగనిదియై నాశరహిత మయినదిగాను సర్వవ్యాపిగాను స్థిరస్వభావముగలదిగాను జలనములేనిదిగాను అనాదియైనదిగాను నున్నది. ఈ యాత్మ కన్నుల కగోచర మనియు మనస్సున కచింత్య మనియుఁ గర్మేంద్రియములకు విషయము గా దనియుఁ దెలియుము. అట్లు తెలిసినపిమ్మట నీయాత్మనుగుఱించి నీవు దుఃఖింపఁదగవు. ఓయర్జునా! శరీరధర్మము లయిన జననమరణములు దేహికే యున్న వని యొకవేళ నీవు తలఁచినను నీవందులకును దుఃఖించుటకుఁ దగవు. ఎందు కనఁగా:—పుట్టినవానికి మరణము నిశ్చయము. మరణము పొందినవానికిఁ దిరుగ జన్మము నిశ్చయము. ఇట్లు తప్పింపఁగూడని పనులకు నీవు దుఃఖించుట సరికాదు. ఓయి యర్జునా! ప్రాణికోట్లు పూర్వస్థితి వ్యక్తముగానిది. మధ్యకాలమునం దగుపడుచున్నది. అంత్యకాలమందును నవ్యక్తము గాఁగలది. ఇట్టిప్రాణికోట్లవిషయమై నీవు దుఃఖపడుట యెందుకు? ఈయాత్మ నొకానొకఁడు యోగసిద్ధివలన నత్యద్భుతవస్తువుంగాఁ జూచుచున్నాఁడు. మఱియొకఁ డత్యద్భుతవస్తు వని చెప్పుచున్నాఁడు. వేఱొకఁడు వినుచున్నాఁడు. ఈప్రకారముగఁ జూచియుఁ నోటఁజెప్పియు వినియు దానిస్వరూపము నెవ్వఁడు నెఱుఁగఁడు. సమస్తప్రాణికోట్లదేహములు నంహరింపఁబడఁగా వాని కంతర్యామియయిన యాత్మ యెప్పుడును సంహరింపఁబడునది కాదు. కనుక నీవు ప్రాణికోట్లనుగుఱించి దుఃఖపడరాదు. నీక్షత్రియజాతిధర్మములు నీ వెఱింగియు నిప్పుడు చంచలచిత్తుఁడవు గా నుండుట సరికాదు. క్షత్రియునకు ధర్మయుద్ధమునకంటె శ్రేయస్కరమైనకార్య మేదియు లేదు. ప్రయత్నము లేకయే ప్రాప్తమయినయుద్ధము స్వర్గద్వారముగా నెంచఁద

గినది. దానిని నీవు వదలిపెట్టుచున్నావు. నీవంటిక్షత్రియు లందఱు స్వర్గాపేక్ష గలవారై తనంతటలభించిన యుద్ధమును జేయుచున్నారు. ధర్మయుక్తమైనయీయుద్ధమును నీవు చేయకపోయితివేని నీక్షత్రియధర్మమును యశస్సును బోఁగొట్టుకొని పాపమును బొందఁగలవు. ఇంతియ కాదు. సమస్తప్రాణులును నీయపకీర్తిని శాశ్వతముగాఁ జెప్పుకొనుచుందురు. శౌర్యధైర్యాధిగుణములు గలవారి కపకీర్తికంటె మరణము మేలు కదా. ఈయుద్ధమునకు సన్నద్ధులయి వచ్చియుండు మహారథికులందఱు నీవు భయపడి యుద్ధములోనుండి తొలంగినట్లుగాఁ దలంతురు. నీధైర్యశౌర్యాదిగుణముల కింతకుమునుపు నిన్ను సన్మానించినవా రిప్పుడు నిన్నలక్ష్యము చేయుదురు. మఱియు నీశత్రువులు నీసామర్థ్యమును నిందించుచుఁ జెప్పఁగూడని మాటలు చెప్పుదురు. అంతకంటె దుఃఖ మేమియున్నది? ఓయర్జునా! యుద్ధములో శత్రువులచేత సంహరింపఁబడితివా నీకుస్వర్గప్రాప్తి కలుగును. లేక శత్రువులను జయించితివా భూమండలాధిపత్యభోగములు గలుగును గనుక యుద్ధముచేయుటకు నిశ్చయించినవాఁడవై లెమ్ము. సుఖదుఃఖముల, లాభాలాభముల, జయాపజయములను సమముగాఁ జూచి తరువాత యుద్ధమునకుఁ బ్రారంభముఁ జేయుము. అట్లు చేసితివేని నీకుఁ బాపము లేదు. ఇదివఱకాత్మవిచార మైనజ్ఞానము నుపదేశించితి నింక యోగవిషయమయిన జ్ఞానమును వినుము. ఈయోగమార్గము ననుసరించుటవలన నీవు కర్మబంధము నివర్తించుకోఁగలవు. కర్మయోగము ప్రారంభించి నిర్విఘ్నముగా జరగకపోయినను గొదవ లేదు. దానివలనఁ బాపము సంభవింపదు. ఈయోగమును స్వల్పమాత్రము ప్రారంభముచేసినను నది జననమరణభయములోనుండి నివర్తింపఁజేయుచున్నది. అర్జునా! యీయోగమందు నిశ్చయాత్మకమయిన బుద్ధియొక్కటే ముఖ్యము. నిశ్చయము లేనివారిబుద్ధులు అంత్యములేక యనేకభేదములయి యుండఁగలవు. వేదముల యర్థవాదములయం దశక్తులయిన యవివేకులు స్వర్గఫలముకంటె వేఱులేదని

చెప్పెడు వేదవాక్యములను నమ్ముచున్నారు. అట్టివాక్యములు వారలకుఁ బూలగుత్తులతో నిండిన తీఁగెలరీతి రమ్యముగాఁ దోఁచుచున్నవి. కోరికలు గలమనస్సు గలవారు స్వర్గాదిభోగములే యుత్తమపురుషార్థములుగాఁ దలఁచి స్వర్గఫలాంతరమందు జన్మమునే కర్మఫలముగా నిచ్చునట్టి సుఖపరిభుత్వముల ప్రాప్తినిగూర్చి విశేషముగాఁ జెప్పెడు వేదవాక్యములనే పలుమాఱు ప్రమాణములుగాఁ జెప్పుచున్నారు. పైనఁజెప్పినప్రకార మర్థవాదములయిన వేదముల మధురవాక్యములయందు మనస్సు లయించి భోగైశ్వర్యములను గోరినజనులకు స్థిరమయిన బుద్ధి యెన్నఁడును గలుగదు. వేదములు త్రైగుణ్యవిషయములయి యుండునవి. నీవు త్రైగుణ్యరహితుఁడవు, శీతోష్ణాదిసుఖదుఃఖరహితుఁడవు, శాశ్వతసత్వగుణవిశిష్టుఁడవు, యోగక్షేమరహితుఁడవు, నాత్మజ్ఞానముకలవాఁడవు నగుము. అనేకకూపములు స్నానపానాదులైనవేర్వేఱుపనులకు వేర్వేఱు గా నెట్లుపయోగించునో యాప్రకారమే పెద్దతటాకమందుఁ గలజల మన్నికార్యములకుఁ దా నొకటే యుపయోగించుచున్నది. అటువలెనే యాత్మజ్ఞాని యైనబ్రాహ్మణుఁడు వేదోక్తము లైనసమస్తకర్మఫలముల నొక్కచోటయిన యాత్మయందే పొందుచున్నాఁడు. నీవు నిత్యనైమిత్తికాదికర్మల నాకర్మఫలములయందుఁ గోరిక లేకయే శ్రద్ధతో నాచరింపుము. కర్మఫలములయం దాశయుంచి కర్మలను జేయకుము. అట్లని కర్మలను వదలిపెట్టవలదు. ప్రాప్త్యప్రాప్తులయందు సమదృష్టికలుగుటయే యోగ మని చెప్పుదురు. నీవు నట్టియోగము నభ్యసించినవాఁడవై జయాపజయములను సమముగాఁ జూచి కోరికలు విడిచి యుద్ధ మనుకర్మను జేయుము. జ్ఞానయోగముకంటెఁ గర్మయోగము నికృష్టమైనది. జ్ఞానయోగమందు నీవు శరణు పొందుము. స్వర్గాదిఫలహేతువులయిన కర్మలు నికృష్టములయినవి. ఈలోకమునందు జ్ఞానయోగము గలవారికిఁ బుణ్యపాపము లంటవు గనుక నీవు జ్ఞానయోగమునకు యత్నమును జేయుము. కర్మయందు ఫలాపేక్ష లేకపోవుటయే యోగము

చెప్పఁబడుచున్నది. జ్ఞానయోగులు కర్మఫలములను వదలి జన్మబంధములు లేనివారై నిరుపద్రవమైనమోక్షస్థానమును బొందుచున్నారు. ఎప్పుడు మోహమువలనఁ గలిగినకల్మషమును నీబుద్ధి వదలిపెట్టుచున్నదో యప్పుడే నీ కదివఱకు వినిన వేదార్థములు నిఁక వినఁదగిన వేదార్థములును సమాప్తి యగుచున్నవి. వేదశ్రవణముచేత ముందుఁ జలింపఁజేయఁబడు నీబుద్ధి యెప్పు డచంచలమయి సమాధిలో నుండునో యప్పుడు నీవు యోగమును బొందఁగలవు. అర్జునుఁడు పలుకుచున్నాఁడు. ఓ కేశవా! యీపైనఁజెప్పినప్రకారము సమాధియందు స్థితప్రజ్ఞ గలపురుషున కేమిలక్షణము? వాఁడెట్లు మాట్లాడును? యెట్లుండును? యెట్లు నడచును? అనియడుగఁగా శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు. ఓయి పార్థా! యెప్పుడు ప్రత్యగాత్మస్వరూపమునందుఁ దనకుఁదానే యానందించి మనోగతము లయినసమస్తకామములను విడిచిపెట్టుచున్నాఁడో యప్పుడు స్థితప్రజ్ఞుఁ డనిచెప్పఁబడును. ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవిక దుఃఖములు గలిగినప్పుడు భయపడనిమనస్సు గలవాఁడును సుఖములయం దాశలేనివాఁడును భయము, రోషము, ప్రీతి, లేనివాఁడును నెప్పు డగునో యప్పుడు వాఁడు స్థితప్రజ్ఞుఁ డయిన ముని యని చెప్పఁబడును. ఏపురుషుఁడు సకలవిషయములయందు నభిలాష లేనివాఁడై యప్రార్థితప్రాప్తము లయినశుభాశుభములను బొందియు సుఖదుఃఖములను బొందఁడో యట్టిపురుషుఁడు స్థితప్రజ్ఞుఁడని చెప్పఁబడును. మఱియుఁ దాఁబేలు తనకరచరణాద్యవయవములను లోపలి కీడ్చుకొనురీతిగా నెప్పుడు యోగి తనయింద్రియములను సర్వవిషయములలోనుండి మరలించుకొనుచున్నాఁడో యప్పు డతఁడు స్థితప్రజ్ఞుఁ డగును. ఉపవాసాదులు చేయుపురుషున కింద్రియములనుండి యాయాయింద్రియవిషయములు మాత్రము నివర్తించునే గాని యభిలాష వదలదు. పరమాత్మను జ్ఞానముచేతఁ దెలిసికొనిన పురుషునకో యభిలాషకూడ నివర్తించును. బ్రహ్మప్రాప్తికొఱ కింద్రియనిగ్రహము చేయుటకుఁ బ్రయత్నము చేయు వివేకులమనస్సునుగూడ ని

యింద్రియములు బలాత్కారముగాఁ జలింపఁజేయుచున్నవి. అట్టియింద్రియములను నిగ్రహించి యోగియై నాయందాసక్తి గలవాఁడై యుండవలసినది. ఎవ్వరి కింద్రియములు స్వాధీనములై యుండునో యట్టిపురుషులు స్థితప్రజ్ఞ గలవారు. విషయములను దలఁచువానికిఁ దదాసక్తి కలుగుచున్నది. ఆయాసక్తిచేత భోగేచ్ఛ పుట్టుచున్నది. ఆభోగేచ్ఛకు విరోధము కలుగునపుడు క్రోధము కలుగుచున్నది. క్రోధమువలన నవివేకము కలుగుచున్నది. అందువలన విస్మృతి గలుగును. తదనంతరము బుద్ధి నశించును. పిదపఁ దాను జెడిపోవును. ఎవ్వఁడు ప్రియాప్రియములు లేక యింద్రియములను దనమనస్సునకు స్వాధీనము చేసికొనుచున్నాఁడో యట్టివాఁడు శరీరపోషకమాత్రేంద్రియవిషయముల ననుభవించువాఁడైనప్పటికి వాఁడు నిర్మలత్వమును బొందుచున్నాఁడు. ఇట్టినిర్మలచిత్తము గలపురుషు నేదుఃఖము నంటదు. అట్టి స్వచ్ఛమయిన మనస్సు గలపురుషున కతిత్వరలో బుద్ధి స్థిరమగుచున్నది. ఇంద్రియనిగ్రహము లేనివాని కాత్మవిషయమయిన బుద్ధి లేదు. ఆత్మస్వరూపభావనయు లేదు. పరబ్రహ్మభావనఁ జేయనివానికిఁ జిత్తోపరతి లేదు. వానికి బ్రహ్మానందసుఖ మెచ్చటనుండి కలుగును? ఎవనియింద్రియములు వానిమనస్సునకు స్వాధీనము లేక విషయములయం దిచ్ఛావిహారముగా నుండునో యట్టిమనస్సు వానియాత్మానాత్మవివేకమును నీళ్ళలోనియోడను గాలి త్రిప్పటలు పెట్టినరీతిగాఁ ద్రిప్పలు పెట్టును. ఓయి యర్జునా! యెవనియింద్రియములు సమస్త విషయములనుండి త్రిప్పఁబడినవో యట్టిపురుషునిబుద్ధి స్థితప్రజ్ఞ యగుచున్నది. ఆత్మానాత్మవివేకజ్ఞానము పామరులకు గోచరము కానిదై చీఁకటివలెనుండునది. ఆచీఁకటియందే యాత్మజ్ఞానము గలవాఁడు స్వస్వరూపమును దెలిసికొనును. ఏజాగ్రదవస్థయందు సమస్తభూతములు విషయముల ననుభవించుచున్నవో యాజాగ్రదవస్థ జ్ఞాని కంధకారమువంటిది. సమస్తనదీనదములజలములు సముద్రములోఁ బ్రవేశించినను నాసముద్రము హద్దుమీఱక యే స్థిరముగా నున్నది. ఆప్రకార

మే యింద్రియవిషయము లన్నియు నచంచలమనస్సు గలపురుషుని యందుఁ బ్రవేశించినను నాపురుషుఁడు నిర్వికారుఁడయి శాంతచిత్తము గలవాఁడుగా నుండును. విషయాసక్తుఁ డైనపురుషుఁడు శాంతిని బొందఁజాలఁడు. ఏపురుషుఁడు సమస్త కామములను వదలి యాత్మాభిమానము లేక యహంకారమమకారములు విడచి సంచరించుచున్నాఁడో యట్టిపురుషుఁడు మోక్షమును బొందును. ఓయిపార్థ ! యీవ యినఁ జెప్పినది బ్రహ్మతత్త్వము. ఈబ్రహ్మతత్త్వ మవసానకాలమందుఁ గూడఁ గలిగినవానికి మోక్షము గలుగును. బాల్యముమొద లీజ్ఞానము గలవాని విషయమై యేమని చెప్పవచ్చును.

ఇట్లుపనిషద్రూపమయినట్టియుఁ బరబ్రహ్మవిద్యయైనట్టియు భగవద్గీత లనఁబడు శ్రీకృష్ణార్జునసంవాదరూపమయిన యోగశాస్త్రమునందు సాంఖ్యయోగ మను రెండవయధ్యాయము ముగిసెను.



శ్రీరాములు.

## 3. కర్మయోగ మనుమూఁడవయధ్యాయము.

అర్జునుఁ డడుగుచున్నాఁడు.

ఓజనార్దనా ! జ్ఞానమార్గము కర్మమార్గమునకంటె శ్రేష్ఠ మయ్యెనేని నన్ను ఘోరమయిన కర్మయందెందుకుఁ బ్రేరేపణ చేయుచున్నావు. సంశయవాక్యములచేత నాబుద్ధిని గలవరపెట్టువానివలె నున్నావు. దేనిచేత నేను శ్రేయస్సును బొందుదునో యదియొక్కటి నిశ్చయించి నాకుఁ జెప్పుము. శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.——ఓయి యర్జునా! విచారణపరులకు జ్ఞానయోగముచేతనుగర్మనిష్ఠులకుఁ గర్మచేతను రెండువిధములయిననిష్ఠలునాచేతఁ జెప్పఁబడినవి. పురుషుఁడు కర్మారంభము జేయనందువలన వానికి జ్ఞానయోగనిష్ఠ గలుగదు. కర్మపరిత్యాగమాత్రమువలనఁ బురుషుఁడు నైష్కర్మ్యలక్షణజ్ఞానసిద్ధిని బొందఁడు. పురుషుఁడు క్షణమయినను గర్మ చేయక యుండఁడు. సర్వజనము ప్రకృతిలోఁ బుట్టిన గుణములచేత స్వాధీనము లేనిదై క

ర్మను జేయుచున్నది. వివేకశూన్యుఁడయి యెవఁడు కర్మేంద్రియము లను నిగ్రహించి మనస్సుచేత నింద్రియవిషయములను గోరుచున్నాఁడో వాఁడు దబ్బఱయాచారము కలవాఁ డని చెప్పఁబడును. ఎవఁడు మనస్సుచేత నింద్రియములనునిగ్రహించి ఫలాకాంక్షలేకయే కర్మను జేయుచున్నాఁడో వాఁ డుత్తముఁ డనఁబడును. నీవు కర్మను నియమముగాఁ జేయుము. కర్మ చేయకయుండుటకంటెఁ గర్మచేయుట శ్రేష్ఠము. కర్మలేకపోయిన నీకు దేహయాత్ర కూడ జరగదు. భగవదర్థమయిన కర్మ దక్కఁ దక్కినకర్మబంధకము భగవదర్థకమైన కర్మను ఫలకాంక్షలేనివాఁడవై యాచరింపుము. చతుర్ముఖబ్రహ్మ ప్రజలను యజ్ఞములతోఁ గూడ సృష్టించి యీయజ్ఞములవలన మీరు వృద్ధిపొందుఁడు ; అవి మీకు నభీష్టముల నిచ్చు నని పలికెను. ఈయజ్ఞములచేత దేవతలను బూజించిన వారు మిమ్ము వృద్ధిపొందింతురు. మీరు పరస్పరసహాయభూతులై క్షేమమును బొందఁగలరు. యజ్ఞముచేత సంతోషించిన దేవతలు మనుష్యుల కభీష్టములయిన భోగముల నిత్తురు. వారిచేత నివ్వఁబడిన భోగములను వారికి సమర్పింపక యెవఁ డనుభవించుచున్నాఁడో వాఁడు చోరుఁడు. యజ్ఞశేషము నెవ్వరు భుజించుచున్నారో వారు సర్వపాపములనుండి విముక్తు లగుచున్నారు. ఎవ రాత్మార్థమై పాకము చేసికొనుచున్నారో వారు పాపమునే భుజించుచున్నారు. ప్రాణు లన్నమువలనఁ బుట్టుచున్నవి. అన్నము వర్ష దేవతవలనఁ బుట్టుచున్నది. వర్ష దేవత యజ్ఞమువలనఁ బుట్టుచున్నది. యజ్ఞము కర్మవలనఁ గలుగుచున్నది. కర్మ వేదములవలనఁ బుట్టిన దని తెలిసికొనుము. ఆవేదము పరమాత్మవలనఁ బుట్టినది. సర్వవ్యాపియైన యాపరమాత్మ యజ్ఞమునం దెల్లప్పుడుఁ బ్రతిష్ఠితమై యున్నయది. ఓయిపార్థ! ఎవ్వఁడీ యాజ్ఞాచక్రము ననువర్తింపఁడో వాఁడు పాపిగా విషయాసక్తుఁడుగావ్యర్థముగాబ్రతుకుచున్నవాఁడు. ఎవఁడాత్మయందు రతిగలవాఁడోయాత్మయందుఁ దృప్తిఁ బొందినవాఁడోయాత్మయందే సంతోషించువాఁడోయట్టివానికిఁగర్మల

తోఁబని లేదు. అట్టిపురుషునికిఁ గర్మ చేసినదానివలనఁ గాని చేయకపో యినదానివలనఁగాని ప్రయోజనము లేదు. అట్టివానికి లోకవిషయ ములతో నేప్రయోజనమును లేదు గనుక ఫలసంగవర్జితుఁడ వై క ర్మ నెల్లప్పుడు నాచరింపుము. అట్లు చేయుపురుషునకు మోక్షము సిద్ధ ముగాఁ బ్రాప్త మగును. జనకాదులు కర్మానుష్ఠానముతోనే జ్ఞానసి ద్ధిని బొందిరి గదా! లోకు లమార్గప్రవర్తకులు గాకుండుటకై నీ వు కర్మ ననుష్ఠింప నర్హుఁడవు. ఉత్తముఁ డేయేకర్మల నాచరించుచు న్నాఁడో యాయాకర్మలనే పామరజనమును నాచరించును. ఉత్తముఁ డు దేనిని బ్రమాణముగా నొప్పుచున్నాఁడో యాప్రమాణమునే పామ రజనము ననువర్తించుచున్నది. మూఁడులోకములయందు నాకుఁ జే యఁదగిన కర్మ లేదు. పొందనిది గాని పొందఁదగినది గాని లేదు. అ యినను నేను గర్మయందు వర్తించుచునే యున్నాను. ఓయిపార్థ! నేను గర్మ చేయకపోయితినేని మనుష్యులందఱు నన్నివిధముల నన్ను నే యనువర్తింతురు. నేను గర్మను వదలితినేని జనులు చెడిపోవుదు రు. వర్ణసంకరము చేసినవాఁడ నగుదును. అప్పుడీజనులను జెఱిపి నవాఁడ నగుదును. ఓయిభారత! పామరు లపేక్షతోఁ గర్మ నేప్ర కారము చేయుచున్నారో యాప్రకారమే విద్వాంసుఁడు లోకోపకా రార్థమై యపేక్షలేకయే కర్మను జేయవలయును. విద్వాంసుఁడు క ర్మయం దాసక్తిగల యవివేకులకుఁ గర్మాసక్తి బుద్ధిని జలింపఁజేయఁ గూడదు. మఱియె ట్లన్న ;— తాను ఫలాపేక్షలేకయే కర్మఁజేయుచు సమస్తకర్మలను బామరులచేత నాచరింపఁజేయవలయును. అహంకా రమోహితమైనమనస్సు గలవాఁడు తాను గర్త యని తలఁచుచు న్నాఁడు. కర్మలు ప్రకృతిగుణములచేతఁ జేయఁబడుచున్నవి. తత్వ జ్ఞానియైననో గుణకర్మవిభజనములు చేసి యింద్రియరూపము లైనగు ణములు విషయరూపము లైనగుణములయందు వర్తించుచున్న వని యెఱింగి వానియం దాసక్తి యుంచఁడు. ప్రకృతిగుణములచేత మో హితు లైనవారు గుణజన్యము లైనకర్మలయం దాసక్తు లగుచున్నారు.

ఈగుణకర్మవ్యాపారములను దెలిసికొనినవారు గుణకర్మలను దెలియనిమూఢులను జలింపఁజేయవలదు గనుక సమస్తకర్మలను నాయందుంచి జ్ఞానముచేత నిష్కాముఁడవై యహంకారము లేనివాఁడవై సంతాపము విడచినవాఁడవై యుద్ధముఁజేయుము. ఏజనులు పైనఁ జెప్పిన నాయభిప్రాయమును విశ్వసించి యసూయలేక యనువర్తించుచున్నారో వారలు పుణ్యపాపకర్మల ఫలములవలన విముక్తు లగుచున్నారు. ఎవరీపైనఁజెప్పిన యభిప్రాయమునం దసూయ గలవారై యనుష్ఠానము లేక యుంచున్నారో యట్టియవివేకులు జ్ఞానశూన్యులై చెడిపోవుదురు. జ్ఞానవంతుఁడు గూడ స్వకీయమైనజన్మాంతరకర్మవాసనకుఁ దగినట్లు ప్రవర్తించుచున్నాఁడు. సమస్తప్రాణులు వారివారి జన్మాంతరకర్మవాసనలను బొందుచున్నారు. కనుక కర్మేంద్రియనిగ్రహమువలన నగుపని యేదియును లేదు. ఇంద్రియముల కింద్రియవిషయములయందు రాగద్వేషములు గలుగుచున్నవి. అట్టిరాగద్వేషములకు స్వాధీనుఁడు కాఁగూడదు. ఆరాగద్వేషములు వీనికి శత్రువులు. యథావిధిగాఁ జేయఁబడిన పరధర్మమునకంటె గుణహీనమయినను స్వధర్మమే శ్రేష్ఠమయినది. స్వధర్మానుష్ఠానమున మరణము నొందినను శ్రేష్ఠమే. పరధర్మము నరకమును గలుగఁజేయును. అర్జునుం డడుగుచున్నాఁడు—ఓయికృష్ణా! పురుషుఁడు కోరనివాఁడయినను దేనిచేతఁ బ్రేరేపింపఁబడినవాఁడయి బలాత్కారముగాఁ బ్రేరేపింపఁబడినవానివలెనే పాపకర్మను జేయుచున్నాఁడు. శ్రీకృష్ణమూర్తివారు చెప్పుచున్నారు. ఓయియర్జునా! రజోగుణములోఁ బుట్టిన యీకామము తృప్తి లేనిది, యీక్రోధము పాపభూత మయినది, యీరెంటిని శత్రువులుగా నెఱుంగవలయును. పొగ నిప్పును ద్రుప్పద్ధమును మావి గర్భపిండము నేరీతిగాఁ గప్పియున్నవో యాప్రకారమే కామము జ్ఞానమును గప్పి కొనియున్నది. ఈకామము మనోబుద్ధులచేత జ్ఞానమునుగప్పి పురుషుని మోహింపఁజేయుచున్నది గనుక నీవు ప్రథమతః ఇంద్రియములను నిగ్రహింపుము. తదనంతరమాత్మ

జ్ఞానము ననుభవజ్ఞానమును నశింపఁజేయు కామమును బాపియని లె
స్సగాఁ దెలిసి విడిచిపెట్టుము. ఇంద్రియములు దేహముకంటె శ్రేష్ఠము
లు మన స్సింద్రియములకంటె శ్రేష్ఠము. బుద్ధి మనస్సుకంటె శ్రేష్ఠ
ము. ఆత్మబుద్ధికంటె శ్రేష్ఠము. యీప్రకారము బుద్ధికంటె శ్రేష్ఠమ
యిన యాత్మను లెస్సగాఁ దెలిసికొని బుద్ధిచేత మనస్సును నిగ్రహిం
చి దుఃఖోత్పత్తికిఁ గారణభూతమయిన కామమును జంపుము.

ఇట్లుపనిషదార్థ మయినట్టియుఁ బరబ్రహ్మవిద్య యైనట్టి
యుభగవద్గీత లనెడుశ్రీకృష్ణార్జునసంవాదరూప మైనయోగశాస్త్ర
మునందుఁ గర్మయోగ మనుమూఁడవ యధ్యాయము ముగిసెను.



౪. జ్ఞానయోగ మనునాల్గవయధ్యాయము.

శ్రీకృష్ణమూర్తివారు చెప్పుచున్నారు. ఓయియర్జునా ! శా
శ్వత మయిన యీయోగవిద్యను సూర్యునికి నే నుపదేశముచేసితిని.
అతఁడు తనకొమారుఁ డైనవైవస్వతమనువున కుపదేశించెను. ఆతండి
క్ష్వాకున కుపదేశించెను. ఈప్రకారము పరంపరగా నుపదేశింపఁబడి
న యీయోగవిద్యను రాజర్షులు తెలిసికొనిరి. బహుకాల మైనం
దువలన నాయోగవిద్య యీలోకమునందు నశించెను. నీవు నాభక్తుఁ
డవు, స్నేహితుఁడవు నని గోప్యమై శ్రేష్ఠమైనట్టి యీయోగవిద్యను
నీ కానుపూర్వికముగా నిప్పు డుపదేశించితిని. అర్జునుఁ డడుగుచు
న్నాఁడు. ఓయికృష్ణా ! సూర్యుని జన్మముముందును నీజన్మము పిదప
యును నైయుండఁగా నీవు సూర్యుని కీయోగవిద్య నుపదేశముచేసితి
నని యెట్లు తెలిసికొందును. అని యడుగఁగా శ్రీకృష్ణమూర్తివారు
చెప్పుచున్నారు. ఓయి యర్జున ! నాకును నీకునిదివఱ కనేకజన్మ
ము లయినవి. అవియన్నియు నే నెఱుంగుదును. నీ వెఱుఁగవు. నేను
బుట్టనివాఁడను నవికారుఁడను బ్రాణులకు నియామకుఁడను నైనను
స్వకీయ మయినప్రకృతి నవలంబించి నామాయచేతఁ బుట్టుచున్నాను.
ఓయిభారత ! యెప్పుడు ధర్మమునకుఁ జెఱుపు వచ్చునో యధర్మమున
కభివృద్ధి గల్గునో యప్పుడప్పుడు నే నవతరించుచున్నాను. మఱియు

శిష్టపరిపాలన దుష్టనిగ్రహధర్మసంరక్షణలకొఱకుఁ బ్రతియుగమునందు నవతరించుచున్నాను. ఎవఁడు నాదివ్యజన్మమును గర్మను యథార్థముగాఁ దెలిసికొనుచున్నాఁడో వాఁడు దేహము చాలించినపిదప వేఱుజన్మమును బొందఁడు. నన్నే పొందుచున్నాఁడు. కామమును గ్రోధమును భయమును వదలిపెట్టినవారైనను స్వాహాపులయి నన్నాశ్రయించిన మహానుభావులు జ్ఞానయోగముచేతఁ బరిశుద్ధులయి నాస్వరూపమును బొందుచున్నారు. ఎవరెవరేయేవిధముగా నన్ను నుపాసించుచున్నారో వారివారి నాయాప్రకారములుగా నే ననుగ్రహించుచున్నాను గనుక సమస్త మయినవారలు నామార్గమునే సమస్తవిధములచేత ననుసరించుచున్నారు. ఈలోకమునందు మనుష్యులు ఫలాపేక్షచేత దేవతలను బూజించుచున్నారు. ఈమనుష్యలోకమునందుఁ గర్మఫలము శీఘ్రములో లభించుచున్నది. గుణములు కర్మలు వీనిభేదములచేత నాలుగువర్ణములు నాచేత సృజింపఁబడినవి. ఆనాలుగువర్ణములకు నేను గర్తనయినను నవికారుఁడను గనుక నన్నుఁ గర్తగానివానిగాఁ దెలిసికొనుము. కర్మలు నన్నంటవు. కర్మఫలములయందు నా కిచ్ఛలేదు. ఈరీతిగా నన్నుఁ దెలిసికొనినజ్ఞానికిఁ గర్మఫలములు బంధములు గావు. ఈప్రకారముగాఁ దెలిసికొని ముముక్షువులయినపూర్వికులచేతఁ గర్మ చేయఁబడినది. కనుక నీవును బూర్వికులచేత ననాదిగాఁ జేయఁబడిన కర్మను జేయుము. కర్మయనఁగా నెద్ది? అకర్మ యనఁగా నెద్ది? యని యీవిషయమందుఁ బండితులు గూడ భ్రమపడుదురు. ఇట్టికర్మాకర్మలయొక్క విషయమును నీకొఱకై చెప్పుచున్నాను. దానిని దెలిసికొనుము. నీవు క్షేమమును బొందఁగలవు. కర్మ యిట్టి దనియు నిషిద్ధకర్మ యిట్టి దనియుఁ గర్మాభావ మిట్టిదనియు నీమూఁడుస్థితులను జక్కఁగాఁ దెలియవలయును. ఈకర్మాకర్మవికర్మల యొక్క యథార్థస్థితిఁ దెలిసికొనుటయశక్యము. కర్మయందుఁ గర్మాభావము నెవఁడు తెలిసికొనుచున్నాఁడో కర్మాభావమునందుఁ గర్మ నెవఁడు తెలిసికొనుచున్నాఁ

డో వాఁడు మనుష్యులలో బుద్ధిమంతుఁడు, వాఁడే యోగి వాఁ
డే సమస్తకర్మలు చేసినవాఁడు. ఎవనికర్మలు కామసంకల్పము లేని
వో యెవ్వనికర్మలు జ్ఞానమనునగ్నిచేత దహింపఁబడినవో యట్టివానిని
బండితుఁ డని విద్వాంసులు చెప్పుచున్నారు. కర్మఫలాపేక్షను విడిచి
నిత్యతృప్తుఁడై విషయప్రవృత్తి లేనివాఁడు కర్మయందుఁ బ్రవర్తించిన
వాఁడయినను నట్టివాఁడు కర్మ చేసినవాఁడు కాఁడు. కోరికలను వదలి
పెట్టి చిత్తస్వాధీనముఁ గలిగి సమస్తవిషయసుఖములయందు నభిమానము
వదలి శరీరపోషణమాత్రమున కుపయుక్తమయిన కర్మను జేయుపు
రుషుని పాపము స్పృశింపదు. అప్రార్థితలాభముచేత సంతోషించి
సుఖదుఃఖాదిద్వంద్వగుణములను సహించి మత్సరములేక సిద్ధ్యసిద్ధుల
యందు సముఁడై కర్మ చేసినవాఁడు కర్మబద్ధుఁడు కాఁడు. ఆసక్తి లేని
వాఁడై ముక్తుఁడై జ్ఞానమందు స్థిరబుద్ధి గలవాఁడయి భగవత్ప్రీత్యర్థ
మయి చేయువానియొక్క కర్మ నిశ్శేషముగా నశించుచున్నది. య
జ్ఞపాత్ర బ్రహ్మమే, హోమద్రవ్యమును బ్రహ్మమే, అగ్నియు బ్ర
హ్మమే, హోమకర్తయును బ్రహ్మమే, బ్రహ్మకర్మసమాధిచేతఁ
బొందఁదగినఫలమును బ్రహ్మమేసుమీ! కొందఱు యోగులు ఫలా
సక్తిచేత దేవతాయజనసాధనమయినయజ్ఞమునే చేయుచున్నారు.
మఱికొందఱు జ్ఞానులు బ్రహ్మమను నగ్నియందుఁ గర్మమను హవి
స్సును హోమముచేయుచున్నారు. మఱికొందఱు యోగులు జ్ఞానేం
ద్రియములను నిగ్రహమను నగ్నియందు హోమముచేసి నశింపఁజే
యుచున్నారు. మఱికొందఱు శబ్దాదివిషయముల నింద్రియము లను
నగ్నియందు హోమముచేసి నశింపఁజేయుచున్నారు. మఱికొందఱు
సమస్తమయిన జ్ఞానేంద్రియకర్మేంద్రియములయొక్క శబ్దాదివిషయ
ములను బ్రాణాదిదశవాయువులయొక్క బహిర్గమనాదికర్మలను జ్ఞాన
ముచేతఁ బ్రజ్వలింపఁబడిన యింద్రియనిగ్రహమనెడి యగ్నియందు
హోమముచేసి నశింపఁజేయుచున్నారు. మఱికొందఱుపుణ్యతీర్థాదు
లయందు ద్రవ్యదానమను యజ్ఞకర్మను జేయుచున్నారు. కొందఱు

దేహములనుగ్రహింపఁజేయుటయనుయజ్ఞకర్మను జేయుచున్నారు. కొందఱు, ప్రాణాయామాది యోగములను యజ్ఞకర్మను జేయుచున్నారు. కొందఱు వేదపారాయణవేదార్థములను యజ్ఞకర్మను జేయుచున్నారు. కొంద ఱింద్రియములను జయించుట యనుయజ్ఞకర్మను జేయుచున్నారు. మఱికొందఱు కఠినమయిన నియమము లనుయజ్ఞకర్మను జేయుచున్నారు. కొంద ఱపానమునందుఁ బ్రాణవ్యాపారమును బ్రాణమునం దపానవ్యాపారమునను కొందఱు పూరక రేచకకుంభకప్రాణాయామములయందుఁ బ్రాణాపానవాయువులగతులను లయింపఁజేయుచున్నారు. ఇంకఁ బలువురు మితమయిన యాహారములు గలవా రగుచుఁ బ్రాణవాయువులను వశీకృతవాయువులయందు లయింపఁజేయుచున్నారు. పైనఁజెప్పిన సమస్తయోగపురుషులు యజ్ఞకర్మలు తెలిసినవారు గనుక తమపాపములను యజ్ఞకర్మలచేత నశింపఁజేయుచున్నారు. యజ్ఞకర్మలో మిగిలిన శేషమును భుజించినవారు శాశ్వత మయినబ్రహ్మమును బొందుచున్నారు. పైనఁజెప్పిన యజ్ఞకర్మలలో నొకటియయినఁ జేయనివానికి నీ లోకమునందు సౌఖ్యము గలుగదు. అట్టివానికిఁ బరలోకప్రాప్తి యెక్కడిది? పైనఁజెప్పినరీతిగా నానావిధము లైనయజ్ఞకర్మలు వేదమువలన విధింపఁబడినవి. ఆయజ్ఞము లన్నియుఁ గర్మరూపము లని తెలియుము. ఈప్రకారము తెలిసికొంటివేని నీవు సంసారబంధమునుండి నివృత్తుఁడవు కాఁగలవు. ఓయిపార్థ! ద్రవ్యసాధనసాధ్య మయినయజ్ఞమునకంటె జ్ఞానస్వరూపమైనయజ్ఞము బహుశ్రేష్ఠమయినది. సమస్తకర్మలు బ్రహ్మజ్ఞానమునందు లయించుచున్నవి. ఇట్టిబ్రహ్మజ్ఞానమును దత్వవిదు లైనజ్ఞాననిష్ఠుల నాశ్రయించి వారికి శుశ్రూషలుచేసి సాష్టాంగనమస్కారములు చేసి ప్రార్థించి తెలిసికొనుము. వా రుపదేశింతురు. పరబ్రహ్మజ్ఞానమును నొందితివేని మరల నీ కిట్టిబుద్ధి మోహము గలుగదు. నేనుజెప్పిన పరబ్రహ్మజ్ఞానమువలన సమస్తచరాచరభూతములు నాత్మరూపమయిననాయందు దర్శింపఁగలవు. పాపులలో నీవు మహాపాపివైనను

సమస్తపాపము నీమహాజ్ఞాన మను తెప్పచేత దాటఁగలవు. చక్కఁగా బ్రజ్వలించు నగ్ని దారువుల నేప్రకారము భస్మము చేయుచున్నదో యాప్రకారమే జ్ఞానమనునగ్ని సమస్తకర్మలను భస్మముచేయుచున్నది. లోకమునందు జ్ఞానముకంటె వేఱుపావనమయినది లేదు. అజ్ఞానమును యోగసిద్ధుఁడు కాలానుగుణ్యముగాఁ దానే తనయందుఁ బొందుచున్నాడు. శ్రద్ధయుజ్ఞానాపేక్షయు నింద్రియనిగ్రహము గలపురుషుఁడు జ్ఞానమును బొందును. అట్లు జ్ఞానమును బొంది యతిశీఘ్రములో నుత్కృష్టమయిన చిత్తోపరతిని బొందును. జ్ఞానము లేనివాఁడును శ్రద్ధలేనివాఁడును సంశయాత్మ గలవాఁడును చెడిపోవును. సంశయాత్మకుని కిహపరలోకసుఖములు గలుగవు. యోగముచేతఁ గర్మలు విడచినవాఁడయి జ్ఞానముచేత సంశయవిముక్తుఁడయి దృఢమయిన మనస్సుగలవాఁడయిన పురుషునిఁ గర్మలు బంధింపవు. అజ్ఞానసంభూతమయిన నీమనస్సులోని సంశయమును జ్ఞానమను ఖడ్గముచేత ఖండించి యోగము ననుష్ఠింపుము, యుద్ధమునకు లెమ్ము.

ఇట్లుపనిషద్రూపమయినట్టియుఁ బరబ్రహ్మవిద్య యైనట్టియు భగవద్గీత లనెడు శ్రీకృష్ణార్జునసంవాదరూప మయిన యోగశాస్త్రమునందు జ్ఞానయోగ మనునాల్గవయధ్యాయము ముగిసెను.



## ౫. కర్మసన్న్యాసయోగమను నైదవయధ్యాయము.

అర్జునుం డడుగుచున్నాఁడు. ఎట్లన: కృష్ణ ! నీవొకప్పుడు కర్మలను బరిత్యాగము చేయుమనియు మఱియొకప్పుడు కర్మలను జేయుమనియుఁ జెప్పుచున్నాఁడవు. ఈరెండింటిలో నెద్ది శ్రేష్ఠమో యది నాకు నిశ్చయించి చెప్పుము. శ్రీకృష్ణమూర్తిగారు చెప్పుచున్నారు. అర్జునా! వినుము, కర్మపరిత్యాగమును గర్మానుష్ఠానము నీరెండుమార్గములును మోక్షసాధకములే. అయిన నీరెండుమార్గములలోఁ గర్మపరిత్యాగమునకంటెఁ గర్మానుష్ఠానము శ్రేష్ఠముగా నున్నయది. ఎవ్వనికి ద్వేషములేదో యెవనికిఁ గోరికలు లేవో యాకర్మయోగి నిత్యసన్న్యాసి. అతఁ డనాయాసముగాఁ గర్మబంధమునుండి

విముక్తుఁ డగుచున్నాఁడు. కర్మసన్న్యాస మైనసాంఖ్యమును గర్మా
నుష్ఠాన మయినయోగమును బ్రత్యేకములని మూఢులు చెప్పుదురే
కాని జ్ఞానులు చెప్పరు. ఈరెంటిలో నొకటిని బాగుగా నభ్యసించిన
వాని కా రెండింటిఫలములు చెందుచున్నవి. సన్న్యాసముచేతఁ బొం
దుస్థానము కర్మచేతను బొందవచ్చును. ఎవ్వఁడు సన్న్యాసముఁ గ
ర్మ నొకటిగాఁ దెలిసికొనుచున్నాఁడో వాఁడే తెలిసినవాఁడు. కర్మలే
నిసన్న్యాసమును బొందుట కష్టము. కర్మానుష్ఠానము గలజ్ఞాని శీఘ్ర
ముగా బ్రహ్మను బొందును. కర్మయోగము చేయువాఁడు చిత్తశుద్ధి
గలిగి మనస్సును స్వాధీనములో నుంచుకొని యింద్రియములను జయిం
చి సమస్తభూతములు తానుగాను దాను సమస్తభూతములుగాను భా
వించి కర్మలను జేసినను వానివలన బంధింపఁబడఁడు. బ్రహ్మజ్ఞాని కన్నుల
తోఁ జూచును, చెవులతో వినును, దేహముచేతఁ దాఁకును, ముక్కుచే
త వాసనచూచును, జిహ్వచేత భక్షించును, గాళ్ళచేత నడచును, ని
ద్రించుచు శ్వాసనిశ్వాసములను విడుచును, మాటలాడును మూత్ర
పురీషములను విడుచును, విషయముల సంగ్రహించుచుఁ గన్నులు మూ
యుచుఁ దెఱచుచు నింద్రియము లింద్రియవిషయములందుఁ బ్రవ
ర్తించుచున్నవే కాని పరబ్రహ్మ నైన తా నేమియుఁ జేయుటలేదని చి
త్తశుద్ధి గలిగి తలఁచును. ఏపురుషుఁడు కర్మలను బ్రహ్మార్పణము చే
సి యాసక్తివిడిచి వానిననుష్ఠించుచున్నాఁడో యాపురుషుఁడు తామ
రాకును నీళ్ళంటనిరీతిని పాపముచేత స్పృశింపఁబడఁడు. కర్మయోగు
లు చిత్తశుద్ధికొఱకు ఫలాసక్తిలేక దేహముచేత మనస్సుచేత బుద్ధిచే
మమతాశూన్యము లైన యింద్రియములచేతను గర్మలు చేయుచున్నా
రు. ఫలాపేక్ష విడిచి కర్మలు చేయువాఁడు పరమార్థ మైనచిత్త
శాంతిని బొందుచున్నాఁడు. యోగి కానివాఁడు కామప్రేరణచేతఁ
గర్మలు చేసి బద్ధుఁ డగుచున్నాఁడు. ఇంద్రియనిగ్రహము గలవాఁ
డు మనస్సుచేత సమస్తకర్మలను వదలిపెట్టి నవద్వారములు గలపట్టన
మను దేహమునందుఁ దాను గర్మ చేయనివాఁడై మఱియొకరిచేతఁ జే

యింపనివాఁడయి యనాయాసముగా నుండును. ఈశ్వరుఁడు కర్తృత్వ మునుబుట్టింపలేదు, కర్మలనుబుట్టింపలేదు, కర్మఫలసంబంధమును గలుగఁజేయలేదు; ఇవియన్నియుఁ బ్రకృతివలనఁగలిగినవి. ఈశ్వరుఁడుపురుషులయొక్క పాపమునుగాని పుణ్యమునుగాని గ్రహింపఁడు. జ్ఞానము నజ్ఞానముగప్పియున్నది గనుక పురుషులు కర్తృత్వాద్యభిమానముచేత మోహమును బొందుచున్నారు. ఎవ్వరికిఁ దమయజ్ఞానము జ్ఞానముచేత నశింపఁజేయఁబడినదో వారికి జ్ఞానము సూర్యునివలెఁ బరమాత్మను స్పష్టముగా నగపఱచుచున్నయది. పాపములను జ్ఞానముచేత నశింపఁజేసినవారు పరబ్రహ్మమునందే బుద్ధి గలవారయి యదే యాత్మస్వరూపముగాఁ గలవారయి యందే యభినివేశము గలవారయి యదే యుత్కృష్టగతి యని నిశ్చయించినవారయి పునరావృత్తిరహితమైన మోక్షమును బొందుచున్నారు. జ్ఞానులు విద్యావినయములు గలబ్రాహ్మణునియందును గోవునందు నేనుఁగునందును శునకమందును దానిసినంజి భక్షించువానియందు నైక్యానుసంధానము చేసి సమానదృష్టి కలవారగుదురు. ఎవ్వరియంతఃకరణము సమస్తమునందును సమదృష్టిని బొందుచున్నదో వారిచేత నీజన్మమునందే మోక్షము జయింపఁబడినది. ఏకారణమువలనఁ బరబ్రహ్మ మేకమై నిర్దోషమై యున్నదో యాకారణమువలన సమదృష్టి గలవారు పరబ్రహ్మమునందున్నవారు. పరబ్రహ్మమునందున్న బ్రహ్మవేత్త భ్రమ విడిచి స్థిరబుద్ధి గలవాఁడై యిష్టమును బొందినపుడు సంతోషింపఁడు. అనిష్టమును బొందినపుడు దుఃఖింపఁడు. ఆసక్తిలేక యింద్రియవిషయములయందే సుఖమును యోగి యనుభవించుచున్నాఁడో యాసుఖమునే పరబ్రహ్మమునందు ననుభవించుచున్నాఁడు. విషయేంద్రియములవలనఁ బుట్టుసుఖము లాద్యంతములు గలవి గనుక యీసుఖములను దుఃఖాస్పదములుగాఁ దెలియుము. అందువలననే పెద్దలావిషయభోగములయందాసక్తి యుంచరు. ఏపురుషుఁడీశరీరమువిడుచుటకు మునుపు కామక్రోధలోభమోహమదమాత్సర్యములవలనఁ బుట్టినయావేశమును *

యింప సమర్థుఁడగునో యట్టిపురుషుఁడే యోగి. అతఁడే బ్రహ్మానందసుఖము ననుభవించువాఁడు. ఏపురుషుఁ డాత్మసుఖియై యాత్మారాముఁడై జ్ఞానస్వరూపియై యంతఃప్రకాశుఁడై యుండునో యట్టియోగి బ్రహ్మస్వరూపియై మోక్షమును బొందుచున్నాఁడు. మహర్షులు పాపవర్జితులై నిస్సంశయాత్ములై యింద్రియనిగ్రహము గలవారయి సమస్తజీవకోట్లకు సౌఖ్యము సేయుటయం దాసక్తి గలవారయి మోక్షమును బొందుచున్నారు. జితేంద్రియులుగా యతులుగా నిశ్చయచిత్తులుగా నుండునాత్మజ్ఞానులకు మోక్షసుఖ మంతట నున్నది. ఏపురుషుఁడు శబ్దస్పర్శరూపరసగంధవిషయముల నింద్రియవ్యాపారములకు వెలిచేసి దృష్టిని భ్రూమధ్యమునందు నిలిపి ప్రాణాపానవాయువులను నాసికముద్వారా సమమయిన శ్వాసనిశ్వాసములుగాఁ జేసి యింద్రియములను మనస్సును బుద్ధిని స్వాధీనపఱచుకొని యిచ్ఛను భయమును గ్రోధమును జయించి మోక్షాసక్తుఁడై యుండునో యామహాపురుషుఁడే ముక్తుఁ డని యెఱుంగుము. మహాపురుషుఁడు నన్ను సమస్తయజ్ఞతపస్సుల ననుభవించువాఁడనియు సమస్తలోకములకు నియామకుఁడనియు సమస్తచరాచరభూతముల కుపకారి యనియు నెఱింగి మోక్షమును బొందుచున్నాఁడు. ఇట్లుపనిషద్రూపమయినట్టియుఁ బరబ్రహ్మవిద్యయయినట్టియు భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జునసంవాదరూపమయినయోగశాస్త్రమునందుఁ గర్మసన్న్యాసయోగ మనునయిదవయధ్యాయము ముగిసెను.



## ౬. ఆత్మసంయమయోగ మనునాఱవయధ్యాయము.

శ్రీకృష్ణమూర్తివారు చెప్పుచున్నారు. ఎవ్వఁడు కర్మఫలాపేక్ష లేక చేయఁదగినకర్మలను జేయుచున్నాఁడో వాఁడు కర్మపరిత్యాగము చేసిన సన్న్యాసియుఁ జిత్తశుద్ధి గలిగిన యోగియు నగుచున్నాఁడు. వాఁడు యోగశాస్త్రసమ్మతముగా నగ్నిహోత్రదానాదికర్మలను వదలిన యోగికంటె నధికుఁడు. సన్న్యాసమని దేనిని జెప్పుచున్నా

రో దానినే కర్మయోగమని తెలిసికొనుము. సంకల్పత్యాగము చేయ నివాఁడు యోగి కాఁజాలఁడు. జ్ఞానయోగముఁ బొంద నిచ్ఛయించిన మునులకు ఫలత్యాగపూర్వకకర్మ సాధనముగా నున్నది. జ్ఞానము గలిగిన పిదప కర్మనివృత్తి యనుకర్మనే సాధనముగాఁ దెలియుము. ఎప్పుడు శబ్దస్పర్శరూపరసగంధవిషయములయందు నిత్యనైమిత్తికాదికర్మలయందు నాసక్తుఁడు గాక యుండునో యప్పుడు సమస్తసంకల్పములఁ బరిత్యజించినవాఁడయిజ్ఞానమును బొందినవాఁ డని చెప్పఁబడుచున్నాఁడు. పురుషుడు తన్నుఁ దనమనస్సుచేతనే యుద్ధరించుకొనవయును. తన్నుఁ దాను జెఱుపుకొనరాదు. తనకుఁ దనమనస్సే బంధువు, తనమనస్సే శత్రువు. ఏపురుషుఁడు తనమనస్సుచేత దేహేంద్రియాదిసమూహమును జయించుచున్నాఁడో యట్టివానికిఁ దనమన స్సుపకారి యగును. ఆయింద్రియజయము లేనివానికి మనస్సే శత్రువగును జితేంద్రియుఁడయి యుపశాంతిని బొందినవాఁడు పరమాత్మస్వరూపుఁడై శీతోష్ణములయందు సుఖదుఃఖములయందు మానావమానములయందు సముఁడై సుఖించుచుండును. శాస్త్రజన్యజ్ఞానముచేత ననుభవజ్ఞానముచేతఁ బరితృప్తమయిన మనస్సుగలవాఁడు సమదర్శియై యింద్రియనిగ్రహము గలిగి మట్టిబెడ్డయందు ఱాయియందు బంగారునందును సమబుద్ధి గలిగిన యోగియై యాత్మానుభవజ్ఞానము గలవాఁ డని చెప్పఁబడును. ఉపకారులయందు స్నేహితులయందు శత్రువులయందు నుదాసీనులయందు (మధ్యస్థులయందు విరోధులయందును) బంధువులయందు సత్పురుషులయందుఁ బాపాత్ములయందు సమబుద్ధిగలవాఁడు యోగారూఢశ్రేష్ఠుఁ డని చెప్పఁబడును. ఆత్మధ్యానము గలయోగి చలింపనిమనస్సు, దేహముఁ గలవాఁడయి కోరికలు లేనివాఁడయి పరిగ్రహశూన్యుఁడయి యొంటరిగా రహస్యప్రదేశమునందు నివసించి మనస్సును నిగ్రహింపవలయును. మిక్కిలి యెత్తును, మిగులఁ బల్లముఁ గానట్టి పరిశుద్ధమయిన సమప్రదేశమునందు మొదట దర్భాసనము వెనుకఁ గృష్ణాజినముఁ బిదప వస్త్రాసనము నుంచవలయును. తర్వాత

నాయాసమునందు స్థిరముగాఁ గూర్చుండి మనస్సును స్థిరముగా నిలిపి యింద్రియవ్యాపారముల నిగ్రహించి యోగాభ్యాసకుఁడు చిత్తశుద్ధికొఱకు యోగముప్రారంభము చేయవలయును. తనశరీరముఁ గంఠముశిరమును జక్కఁగా నిలిపి స్థిరచిత్తుఁడై దిక్కులుచూడక తనముక్కుకొనమీఁద దృష్టిని నిలుపవలయును. ఉపరతమైనమనస్సుగలిగి భయవర్జితుఁడయి బ్రహ్మచర్యవ్రతమున మనస్సును దృఢముచేసికొని నాయందు నిలిపి నన్నే యుత్కృష్టముగా నెంచి యుండవలయును. ఇట్లు నిశ్చయించిన మనస్సు గలయోగి తనమనము నెల్లప్పుడు స్వాధీనము చేసికొని సర్వోత్కృష్టమయి నాస్వాధీనముగా నుండు మోక్షసుఖమును బొందుచున్నాఁడు. ఈయోగ మధికముగా భోజనముచేయువానికి బొత్తిగా భోజనముచేయనివానికి నధికనిద్రగలవానికి బొత్తిగా నిద్రింపనివానికి లభింపదు. దుఃఖముల బోఁగొట్టు నీయోగము మితభోజనము మితసంచారము మితకర్మ మితనిద్ర మితముగా మేలుకొనుట గలపురుషునకు లభించును. ఎప్పుడుమనసును స్వాధీనము చేసికొని పరమాత్మానుసంధానముఁ జేయునో యప్పుడు నిష్కాముఁ డగుయోగి యనిచెప్పఁబడును. మనోనిగ్రహము గలిగి యాత్మయోగముఁ జేయుయోగి గాలిలేనిచోట దీప మెట్లు కదలక యుండునో యట్లుండును. ఏయవస్థయందు మనస్సు యోగానుష్ఠానముచేత నిగ్రహింపఁబడి యుపరతిని బొందునో యేయవస్థయందు మనసుచేతఁ బరమాత్మను దర్శించుచుఁ దనయందే యానందముంబొందునో యేయవస్థయం దింద్రియములకు గోచరముగాక బుద్ధికి గ్రాహ్యమయిన బ్రహ్మానందము ననుభవించునో యేయవస్థయందుఁ దత్స్వరూపబ్రహ్మానందములో నున్నయోగి చలింపఁడో యేలాభమును బొంది యితరలాభముల నధికములుగా నెన్నఁడో యేలాభముఁ బొందిన వెనుక నెంతగొప్ప దుఃఖము వచ్చిన మనస్సు చలింపదో యట్టిపూర్వోక్తమయిన యవస్థ దుఃఖమునకు లోపడనిది. దానిని యోగ మని తెలిసికొనవలయును. ఆ యోగమును నిస్సంశయమును దుఃఖములకు లోపడనిదియునగు మన

స్సుచేత నభ్యసింపవలయును. సంకల్పము వలనఁ బుట్టినకోరికలను దృఢమనస్సుచేత నిశ్శేషముగా విడిచి యింద్రియవ్యాపారములను నిగ్రహించి యోగముఁ బ్రారంభింపవలయును. దృఢమయిన బుద్ధిచే మనస్సు నాత్మయందుఁ బ్రవేశింపఁజేసి మెల్లమెల్లఁగా నుపరతి నొందవలయు. అట్లు చేయు నప్పు డితరచింతలు విడువవలయు. చంచలము నస్థిరము నగు మనసేవిషయములయందు సంచరించుచున్నదో యావిషయములనుండి దానిని మరలించి యాత్మయం దుండునట్లు తనస్వాధీనము చేసికొనవలయును. శాంతి నొందినమనస్సు క్షీణించిన రజోగుణముఁ గలిగి జీవన్ముక్తుఁడు పాపరహితుఁడు నైనయోగి నద్వితీయ బ్రహ్మానందము దనకుఁదానె పొందును. పైనఁ జెప్పినరీతిగా సర్వకాలములయందు మనస్సు నిలిపి పాపరహితుఁ డయినయోగి యనాయాసముగా బ్రహ్మానందము ననుభవించుచున్నాఁడు. సమస్తభూతములయందు సమదర్శనై యోగముతోఁగూడిన మనస్సుగలయతఁడు సమస్తభూతములయందుఁ దన్నుఁ దనయందు సమస్తభూతములఁ జూచుచుండును. ఎవఁడు సమస్తభూతములయందు నన్ను నాయందు సమస్తభూతములఁ జూచునో వానికి నేను నాకు వాఁడుఁ బ్రత్యక్షరూపులుగా నుందుము. ఏయోగి యద్వైతుఁడయి సర్వభూతములయందు నన్ను సేవించునో యాతం డనేకప్రకారములుగా వర్తించువాఁ డయినను నాయందే వర్తించుచున్నాఁడు. ఎవ్వఁడు సర్వభూతసుఖదుఃఖములఁ దనవిగా భావించునో యట్టిజ్ఞాని నాకు సమ్మతుఁ డగుపరమశ్రేష్ఠునిగాఁ దెలియుము. అని చెప్పఁగా నర్జునుఁ డడుగుచున్నాఁడు. ఓయి మధుసూదన ! నీవు చెప్పిన సమత్వమనుయోగ మసాధ్యముగా నున్నయది. మనస్సు చంచలమయినది గనుక యీయోగము యొక్క స్థిరమయినస్థితి నాకుఁ దెలియలేదు. మనస్సు చంచలమయినది యు క్షోభపెట్టునది యు నిగ్రహింప శక్యముగానిది యు దృఢమయినదియు గా నున్నది. వాయువును స్వాధీనము చేసికొనుట యెంత కష్టమో మనస్సును స్వాధీనముజేసికొనుటయు నంతకష్ట మని తలఁ

చుచున్నాను. అనియడుగఁగా శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు. మనస్సు చంచలమయినదియు నిగ్రహింప శక్యముగానిది యు ననుటకు సంశయము లేదు. అట్లున్నను నాత్మానుసంధానాభ్యాసముచేత వైరాగ్యముచేతను నట్టిమనస్సును స్వాధీనము చేసికొనవచ్చును. చిత్తస్వాధీనము లేనివానికి యోగ మసాధ్యము. చిత్తస్వాధీనము గలవాఁడు తగినయుపాయములచేఁ బ్రయత్నపడి యోగి కావచ్చు నని నాయభిప్రాయము. అనిచెప్పఁగా నర్జునుఁ డడుగుచున్నాఁడు. ఓయికృష్ణా! యోగమునందు శ్రద్ధ యుఁ బ్రయత్నముం గలిగియు నియమము లేకపోయినందునఁ జంచలమనస్సు గలుగువానికిఁ దత్ఫలము లేకపోవుచున్నది గదా యట్టివానిగతి యేమి యగుచున్నది. పరమాత్మానుసంధానముఁ జేయలేనిమూఢుఁడు నిరాశ్రయుఁడై కర్మమార్గజ్ఞానమార్గముల రెండింటివలనను భ్రష్టుఁడయి చెదరిపోయిన మేఘమువలెఁ జెడిపోకుండునా. నాకుఁ గలిగినయీసంశయము నిశ్శేషముగా నివర్తింపఁజేయుటకు నీవే తగుదువు. ఈసంశయమును బోఁగొట్టుటకు నీకంటె సమర్థులులేరు. అని కోరఁగా శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు. ఓయిపార్థ! అట్టి భ్రష్టున కిహపరలోకముల యందు నాశనము లేదు. మంచిచేసినవాఁ డొకప్పుడుఁ జెడుపునొందఁడు. తద్భ్రష్టుఁడు పుణ్యాత్ములు పొందెడు లోకముఁ బొంది యనేకసంవత్సరములు వసించి సదాచారవంతులయిన శ్రీమంతుల గృహమునఁ బుట్టుచున్నాఁడు. అట్లు గానిచో నిశ్చయాత్మకబుద్ధిగల యోగులవంశమునందుఁ బుట్టును. ఇట్టిజన్మము గలుగుట లోకమునం దతిదుర్లభ మని యెఱుంగుము. పైనఁ జెప్పినప్రకారము యోగికులమునందుఁ బుట్టి పూర్వజన్మమునందు సంపాదించిన యాత్మానాత్మవివేకజ్ఞానముఁ బొందుచున్నాఁడు. పిమ్మట జ్ఞానసిద్ధినిమిత్తమై ప్రయత్నము చేయును. పైభ్రష్టుఁడు స్వాధీనమనస్సు లేనివాఁడైనను బూర్వజన్మాభ్యాసముచే నింద్రియవిషయముల నుండి నివృత్తుఁ డగుచున్నాఁడు. యోగస్వరూపముఁ దెలియ నిచ్చయించినవాఁడు కూ

డ వేదోక్తకర్మానుష్ఠానఫలముల నతిక్రమించినవానినిగాఁ దెలియుము. జ్ఞాననిష్ఠుఁడు పరబ్రహ్మైక్యమునకుఁ బ్రయత్నములు చేయుచున్నవాఁడై పాపవిముక్తుఁడై యనేకజన్మసంస్కారములవలనఁ బరిశుద్ధుఁడై తరువాత సర్వోత్కృష్టమయిన మోక్షముఁ బొందుచున్నాఁడు. యోగి మహర్షులకంటె శాస్త్రార్థపాండిత్యము గలవారికంటెఁ గర్మనిష్ఠులకంటె నధికుఁడు గనుక నీవు యోగము గలవాఁడవు కమ్ము. ఎవఁడు విశ్వాసము గలిగి నన్నాశ్రయించి మనస్సుచేత సేవించుచున్నాఁడో యతఁడు సమస్తయోగులలో శ్రేష్ఠుఁ డని నామతము.

ఇట్లుపనిషదార్థమయినట్టియుఁ బరబ్రహ్మవిద్యయయినట్టియు భగవద్గీత లనెడుశ్రీకృష్ణార్జునసంవాదరూపమయిన యోగశాస్త్రమునం దాత్మసంయమయోగ మనునాఱవయధ్యాయము ముగిసెను.



## ౭. విజ్ఞానయోగప్రారంభము.

శ్రీకృష్ణమూర్తివారు చెప్పుచున్నారు. ఓయిపార్థ ! నాయందు మనస్సునిలిపి నన్నాశ్రయించి యోగాభ్యాసము చేయుచు సంపూర్ణుఁడ నైననన్ను నిస్సంశయముగా నెట్లు తెలిసికొనెదవో దానిని వినుము. నీకొఱ కనుభవజ్ఞానముతోఁగూడిన శాస్త్రీయజ్ఞానమును సవిస్తారముగాఁ జెప్పెదను. ఈజ్ఞానమును దెలిసికొంటివేని వేఱు తెలిసికొనవలసిన విషయ మేదియు లేకపోవును. వేయిమంది మనుష్యులలో జ్ఞానసిద్ధికొఱ కొకానొకఁడుమాత్రమే యత్నము చేయుచున్నాఁడు. అయత్నము చేసినట్టి సిద్ధులలో నొకానొకఁడు మాత్రమేనన్ను యథార్థముగాఁ దెలిసికొనుచున్నాఁడు. భూమి యుదకము నగ్నివాయువు నాకాశము మనస్సు బుద్ధి యహంకారము నని నామాయ యెనిమిదివిధములుగా నున్నది.

పైనఁ జెప్పిన నామాయాశక్తి నికృష్టమయినది. దీనికంటెను జీవభూతమయి యుత్కృష్టమయిన ప్రకృతి మఱియొకటి యున్న దని తెలియుము. దానిచేతనే యీప్రపంచము ధరియింపఁబడి యున్నది.

ఈజీవభూత మైనపరప్రకృతియే సమస్తభూతములకుఁ గారణ మని నిశ్చయింపుము. సమస్తజగత్తులకు నుత్పత్తిలయస్థానములు నేనే. నాకంటె నన్యమయిన కారణము వేఱొక్కటి లేదు. ఈసమస్తప్రపంచము దారమునందు రత్నములవలె నాయందుఁ గూర్పఁబడియున్నది. ఉదకమందు రసము సూర్యచంద్రులయందుఁ బ్రకాశము వేదములయందుఁ బ్రణవము నాకాశమునందు శబ్దము పురుషులయందుఁ బౌరుషమును నేనని తెలిసికొనుము. భూమియందు సుగంధము నగ్నియందుఁ దేజము సమస్తభూతములయందు నాయువుఁ దపస్వులయందుఁ దపస్సు నేనుగా గ్రహింపుము. సమస్తచరాచరభూతముల కుత్పత్తికారణ మైనయనాదిబీజము బుద్ధిమంతుల బుద్ధియుఁ దేజస్సు గలవానియందలి తేజస్సును నేనుగాఁ దెలిసికొనుము. బలవంతులయందుఁ గామరాగములు లేనిబలము ప్రాణులయందు ధర్మమునకు విరుద్ధముగాని కామము నేను గాఁ దెలిసికొనుము. సత్వగుణరూపము లైనశమదమాదులు రజోగుణరూపము లైనగర్వసంతోషాదులుఁ దామసగుణరూపము లైనశోకమోహాదులు నాయం దుత్పన్నము లయినవియని యెఱుంగుము. వానికి నేను స్వాధీనుఁడను గాను. అవి నాకు స్వాధీనములు. ఈసత్త్వరజస్తమసాదిగుణవికారములచేత మోహింపఁబడిన యీసమస్తజగత్తును వికారరహితుఁడ నై గుణములకంటెఁ బరుఁడ నైన నన్నుఁ దెలిసికొనఁజాలదు. నాయం దుత్పత్తియై త్రిగుణాత్మకమయిననామాయ నెవరును మీఱఁజాలరు. ఎవరు నన్నే శరణు పొందుచున్నారో వా రీమాయ నతిక్రమింపఁగలరు. పాపము చేయు జనులు నవివేకులు నధములు నామాయవలన జ్ఞానశూన్యులై యసురస్వభావులై హింసాదికర్మలను జేయువారలు నన్ను శరణు పొందరు. నన్ను నాశ్రయించు పుణ్యపురుషులు నాలుగుతరగతులు గా నున్నారు. వార లెవ్వ రనిన చోరవ్యాఘ్రవ్యాధులచేతఁ బీడింపఁబడినవారు, జ్ఞానాపేక్ష గలవారు, సకాములు, జ్ఞానముగలవారు. ఈనాలుగుతరగతులవారలలో నచలభక్తిఁగల యాత్మజ్ఞాని యందఱికంటె శ్రే

ష్టుఁడు ; అట్టిజ్ఞాని నాకు మిక్కిలి ప్రియుఁడు ; అతనికి నేనును మిక్కిలి ప్రియుఁడను. ఈనాలుగుతరగతులవారు నుత్కృష్టులే. అయిన నందు జ్ఞాని నేనే యని నాయభిప్రాయము. ఎందువలన ననఁగా: అచంచల మనస్సు గలజ్ఞాని తనకు నన్నే యుత్తమగతిగా నమ్మి యున్నవాఁడు. జ్ఞానముకొఱకుఁ బ్రయత్నించుచుండువాఁ డనేకజన్మము లెత్తిన తర్వాత జ్ఞానియై సమస్తము వాసుదేవస్వరూప మని యెఱింగి నన్ను శరణు పొందుచున్నాఁడు. అట్టిమహాపురుషుఁడు మిక్కిలి దుర్లభుఁడు. మనుష్యులు కోరికలచేత జ్ఞానశూన్యులై యాయాకోరికలనిచ్చు దేవతలను వారివారిస్వభావములచేత నాయాశాస్త్రోక్తనియమములనాచరించుచు శరణుపొందుచున్నారు. ఎవ్వఁ డెవ్వఁ డేయేకోరికలచేత నేయేదేవతలను భక్తిశ్రద్ధలతో సేవించునో వానివాని కాయాదేవతలయందు శ్రద్ధాభక్తులను నేను స్థిరముచేయుచున్నాను. అట్టిపురుషుఁ డట్టిశ్రద్ధచేత నాయాదేవత నారాధించుచున్నాఁడు ; అట్టిదేవతద్వారా నావలననే యివ్వఁబడిన నానివానియభీష్టములను వాఁడువాఁడు పొందుచున్నాఁడు. అల్పబుద్ధి గలయాపురుషుల కోరికలఫలములు నశింపఁగలవు. దేవతలను బూజించువా రాయాదేవతలస్థానములను జెందుచున్నారు ; నాభక్తులు నన్నే పొందుచున్నారు. వ్యక్తముగాని నన్ను బుద్ధిహీనులు వ్యక్తుఁ డయినవానిఁగాఁ దలఁచుచున్నారు. నాసర్వోత్కృష్టతను దెలియనివారు నాకు నాశము గల దని తలఁచుచున్నారు. యోగమాయవలనఁ గప్పఁబడిన నే నెవ్వరిచేతను దెలియశక్యము గానివాఁడను. మూఢుఁడు నన్ను జన్మరహితునిగా నాశరహితునిగాఁ దెలిసికొనఁజాలఁడు. భూతకాలమునం దుండినట్టియు వర్తమానకాలమం దున్నట్టియు భవిష్యత్కాలమునం దుండఁబోవునట్టియు ప్రాణికోట్ల నే నెఱుంగుదును. అయినను నన్నెవ్వఁడు నెఱుంగఁడు. ఈస్థూలదేహమునం దిచ్ఛాద్వేషములవలనఁ బుట్టిన ద్వంద్వరూప మైనసుఖదుఃఖములయందు మోహముచేత సమస్తప్రాణులు జన్మకాలమునందే యవివేకమును జెందుచున్నవి. సుకృతకర్ములు

గలపురుషులు వారిపాపములు నశించినపిదప ద్వంద్వగుణము లయిన దుఃఖము లనెడు నవివేకమునుండి విముక్తులయి చలింపని నియమము తో నన్ను సేవించుచున్నారు. ఎవ్వరు జననమరణరహితమయిన మో క్షాపేక్షతో నన్నాశ్రియించి యందులకుఁ దగినయత్నములు చేయు చున్నారో యట్టివారు సమస్తజీవకోటికి నంతర్గతముగా నుండునాప రబ్రహ్మమును సమస్తకర్మలను దెలిసికొనినవా రగుదురు. అధిభూ తాధిదైవతములతోడ నధియజ్ఞముతోడను గూడుకొనియుండు న న్నే పురుషులు తెలియుదురో వారంత్యకాలములఁ గూడ నచంచలమన స్సు గలవారయి నన్నుఁ దెలిసికొందురు.

ఇ ట్లుపనిషదూపమయినట్టియుఁ బరబ్రహ్మవిద్యయయినట్టి యు భగవద్గీత లనెడుశ్రీకృష్ణార్జునసంవాదరూప మయిన యోగశా స్త్రమునందు విజ్ఞానయోగ మను నేడవయధ్యాయము ముగిసెను.

---

౮. అక్షరపరబ్రహ్మయోగ మను నెనిమిదవయధ్యాయము.

అర్జునుఁ డడుగుచున్నాఁడు. ఓయిపురుషోత్తమా ! ఆపరబ్ర హ్మ మెద్ది ? అధ్యాత్మ మనఁగా నేమి ? కర్మయనఁగా నెట్టిది ? అధి భూతమని యెద్ది చెప్పఁబడుచున్నది ? అధిదైవ మన నెద్ది చెప్పఁబడును? ఈశరీరమునం దధియజ్ఞుఁడనువాఁ డెవ్వఁడు ? వాఁ డె ట్లుండువాఁడు ? నిశ్చలచిత్తము గలవారలచేత నవసానకాలమునందు నీ వేవిధముగాఁ దెలియఁదగినవాఁడవు ? ఇవియన్నియును నాకు విశదముగాఁ దెలియఁ జేయుము. అనియడుగఁగా శ్రీకృష్ణమూర్తివారు జెప్పుచున్నారు. ఓ యియర్జున ! పరబ్రహ్మము నాశరహితమయినది. ఆపరబ్రహ్మ స్వభావమే యధ్యాత్మము. ప్రాణులయుత్పత్తి వృద్ధినిమిత్తమయి చే యునది కర్మయనఁబడును. నశించునట్టి స్వభావముగల సమస్తచరా చరములు నధిభూత మని చెప్పఁబడును. అధిదైవ మనఁగా హిరణ్యగ ర్భస్వరూపుఁడు. ప్రాణులదేహములయం దంతర్యామి నైనయధియ జ్ఞుఁ డనువాఁడను నేనే. ఏపురుషుఁడు మరణకాలమునందు నన్నే స్మర ణచేయుచు శరీరమును విడుచుచున్నాఁడో వాఁడునన్నుఁ బొందుచు

న్నాఁడు. ఇందు కొంతమాత్రము సందేహము లేదు. జను లే యే దేవతలను నిశ్చలచిత్తములతో నంతకాలమునందు స్మరించుచు దేహములను విడుచుచున్నారో వా రాయా దేవతల స్వరూపములను బొందుచున్నారు గనుక నీవు సమస్తకాలములయందు నన్నే చింతించుచు యుద్ధముఁ జేయుము. నాయం దచంచల మనోబుద్ధుల నుంచితివేని నన్నుఁ బొందఁగలవు. ఇందుకు సందేహములేదు. అభ్యాసయోగముతోఁ గూడుకొని యితరచింతలు లేనిమనస్సుతో దివ్యరూపుఁ డయినమహాపురుషు నెవ్వఁడు స్మరణచేయునో వాఁ డాతనినే పొందుచున్నాఁడు. ఆతఁడు సర్వజ్ఞుఁడుఁ, బురాణపురుషుఁడు, సమస్తప్రపంచములకు శిక్షకుఁడు, సూక్ష్మాణువుకంటె సూక్ష్మస్వరూపము గలవాఁడు సమస్తచరాచరములకుఁ గర్మఫలదాయి చింతింపనశక్యమయినస్వరూపముగలవాఁడు సూర్యునితేజస్సువంటి తేజోరూపము గలవాఁడు నజ్ఞానలక్షణమయిన యంధకారమునకంటెఁ బరుఁడు. దేహావసానకాలమునం దచంచలమనస్సుతో భక్తివహించి యోగజన్యమయిన చిత్తస్థైర్యతోఁ గనుబొమ్మల మధ్యస్థానమునందుఁ బ్రాణవాయువులను ప్రవేశింపఁజేసి పైనఁ జెప్పినపరమపురుషు నెవ్వఁడు చింతించునో యట్టియోగపురుషుఁడు దివ్యోత్కృష్టమయిన మహాపురుషునిఁ బొందుచున్నాఁడు. వేదార్థతత్త్వముల నెఱింగినవా రేస్థానమును నాశరహితమని చెప్పుచున్నారో జితేంద్రియులై నిష్కాములయిన సన్న్యాసులే నాశరహితమైనస్థానమును బ్రవేశించుచున్నారో యేపరమోత్తమమయినపదము నిచ్చయించి జనులు గురుకులవాసముఁ జేయుచుబ్రహ్మచర్యవ్రతమును జలుపుచున్నారో యట్టినాశరహిత మయినపరమోత్తమపదమును నీకొఱకు సంక్షేపముగాఁ జెప్పుచున్నాఁడను. ఇంద్రియద్వారముల నరికట్టి మనస్సును హృదయమునందు నిలిపి తనప్రాణములను సహస్రారచక్రమునందుఁ జేర్చి యోగము నభ్యసింపవలయును. పరబ్రహ్మవాచక మయినయోమ్మను నేకాక్షరము నుచ్చరించుచు నోంకారస్వరూపుఁ డయిన నన్నుఁ జింతించుచు నెవ్వఁడు దే

హామును విడుచుచున్నాఁడో యట్టివాఁడు పరమోత్కృష్ట మయిన మోక్షపదమును బొందుచున్నాఁడు. ఎవ్వఁడు విషయాంతరములయందుఁ బ్రవేశింపని నిశ్చలమనస్సు గలిగి పరబ్రహ్మస్వరూపుఁడ నైనన న్ను సర్వకాలములయందును జింతించుచున్నాఁడో యట్టినిరంతరధ్యానపరుఁ డయినయోగికి నేను సులభుఁడను. మహాత్ము లయినయోగీశ్వరులు పరమోత్కృష్ట మయినయోగసిద్ధిచే నన్నుఁ బొందినవారై నాశాస్పదమై దుఃఖాస్పదమయినట్టి జన్మములను దిరుగఁ బొందరు. బ్రహ్మాండమునకు లోపడిన యావత్తులోకములును జీవులకు మరల జన్మముల నివ్వఁగలస్వభావము గలవి. నన్నుఁ బొందినపిదపనో పునర్జన్మములు లేవు. సహస్రమహాయుగకాలనిర్ణయ మయినబ్రహ్మయొక్కపగటిని నంతేపరిమాణముగల బ్రహ్మయొక్క రాత్రిని నేమహాపురుషులు తెలియుదురో యట్టివారే రాత్రియుఁ బవళ్ళుఁ దెలిసినవారుగా నున్నారు. బ్రహ్మయొక్క పగటికాలప్రారంభమునం దవ్యక్త మైన ప్రకృతిలోనుండి వ్యక్తమయిన స్థావరజంగమాత్మక సర్వభూతప్రపంచములు బుట్టుచున్నవి. ఆబ్రహ్మకు రాత్రికాలప్రారంభములో నీసమస్తప్రపంచములు నవ్యక్త మయినప్రపంచములో మరల లీనమగుచున్నవి. ఏప్రాణిసమూహము తత్పూర్వకల్పమునందుఁ బుట్టెనో యాప్రాణిసమూహమే స్వాధీనము లేనిదై పగలు వచ్చినప్పుడెల్లఁ బుట్టుచు రాత్రి వచ్చినప్పుడెల్ల లీన మగుచున్నది. పైనఁ జెప్పినభూతమయప్రపంచములకుఁ గారణరూపుఁ డయినయీశ్వరునికంటె వేరై యుత్కృష్టమై యగోచరమై శాశ్వతమై యుండుపరబ్రహ్మ మనునది యొక్కటి గలదు. ఆపరబ్రహ్మము సమస్తప్రపంచములు నశించుచుండఁగా నదినశింపునది గాదు. ఏపరబ్రహ్మ మింద్రియములకు గోచరముగాక నాశరహితముగా నున్న దని చెప్పఁబడునో యదియే పరమోత్కృష్ట మయినమోక్షస్థానముగాఁ జెప్పఁబడుచున్నది. ఆస్థానమును బొందినవారికిఁ దిరుగా జన్మములు లేవు. అదియే నాస్థాన మయినపరమపదముగాఁ దెలిసికొనుము. ఎవ్వనియం దీసమస్తజగములులీ

స్థమై యున్నవో యెవ్వనివలన నీసమస్తజగత్తులు వ్యాపింపఁబడియున్నవో యట్టిపరమపురుషు నితరాసక్తి లేనినిశ్చలభక్తియోగముచేతఁ బొందవచ్చును. ప్రణవోపాసకులు దేహములు విడిచి యేమార్గమునఁ బోయి తిరిగి జన్మములను బొందరో కర్మయోగులు దేహములను విడిచి యేమార్గమునుబోయి తిరిగిజన్మములను బొందుచున్నారో యామార్గములను జెప్పుచున్నాను. ఏమార్గమునం దగ్న్యభిమానదేవతయు దివసాభిమానదేవతయు శుక్లపక్షాభిమానదేవతయు నుత్తరాయణాభిమానదేవతయుఁ బ్రాపకులుగా నున్నారో దేహములను విడచి యాయర్చిరాదిమార్గములఁ బోవుప్రణవోపాసకులు క్రమముగాముక్తిని బొందుచున్నారు ఏమార్గమునందు ధూమాభిమానదేవతయు రాత్ర్యభిమానదేవతయుఁ గృష్ణపక్షాభిమానదేవతయు దక్షిణాయనాభిమానదేవతయుఁ బ్రాపకులుగానున్నారో దేహములనువిడిచి యాధూమాదిమార్గములఁ బోవుకర్మయోగులు చంద్రలోకమును బొందికర్మక్షయానంతరమున మరల జన్మములనెత్తుచున్నారు. పైనఁ జెప్పినప్రకారమీలోకమునకు శుక్లకృష్ణములని జ్ఞానాజ్ఞానప్రకాశములైన రెండుమార్గములు శాశ్వతముగా నేర్పడియున్నవి. వానిలో జ్ఞానప్రకాశమైనశుక్లమార్గము పునర్జన్మములు లేనిదిగాను నజ్ఞానప్రకాశమైన కృష్ణమార్గము మరల జన్మములు గలదిగా నున్నది. ఆరెండుమార్గములను దెలిసినయోగులు మోసపోనేరరు. అందువలన సమస్తకాలములయందు నీ వీయోగముతోఁ గూడినవాఁడవు కమ్ము. యోగులు వేదార్థములు తెలిసికొనుటయందుఁ గాని క్రతువులు చేయుటయందుఁ గాని తపస్సులు చేయుటయందుఁ గాని దానములుచేయుటయందుఁ గాని చెప్పియుండుఫలములను లక్ష్యముచేయరు. వీనియందుఁ గలఫలములు పునర్జన్మహేతువు లని తెలిసినవారై యాదికారణమయి పరమోత్కృష్టమయిన పరబ్రహ్మమును బొందుచున్నారు.

ఇట్లని యుపనిషద్రూప మయినట్టియుఁ బరబ్రహ్మవిద్యయైనట్టియు భగవద్గీత లనెడుశ్రీకృష్ణార్జునసంవాదరూప మయినయోగ

శాస్త్రమునం దక్షరపరబ్రహ్మయోగ మనునెనిమిదవయధ్యాయము ముగిసెను.



౯. రాజవిద్యారాజగుహ్యయోగ మనుతొమ్మిదవయధ్యాయము.

శ్రీకృష్ణమూర్తివారు చెప్పుచున్నారు. పార్థ! అసూయలేనినీకు శాస్త్రసమ్మతమై యనుభవముతోఁ గూడిన యీదిగువ వివరింపఁబోవు రహస్య మగుజ్ఞానమును జెప్పుచున్నాను, దానిని దెలిసికొంటివేని నశుభ మగునీసంసారములోనుండి విముక్తుఁడవు కాఁగలవు. ఈ జ్ఞానము పరమోత్కృష్ట మయినదిగాను బరమపావన మయినదిగాను బరమ శ్రేష్ఠమయినది గాను బరమ రహస్య మయినది గాను బ్రత్యక్షసుఖబోధక మయినదిగాను ధర్మముతోఁ గూడుకొనినదిగాను నాశరహిత మయినదిగాను నభ్యసించుటకు మిక్కిలి సులభకర మయినదిగా నున్నయది. ఇట్టియాత్మజ్ఞానధర్మమును విశ్వసింపనివారు నన్నుఁబొందక మృత్యువుతోఁ గూడినసంసారమునకు లోపడుచున్నారు. ఈసమస్తజగత్తు నింద్రియములకు గోచరముగాని రూపము గలనాచే వ్యాపింపఁబడి యున్నది. ఈసమస్తప్రాణిసమూహములు నాయం దున్నవి. నేనాప్రపంచములనంటి యున్నవాఁడను గాను. బ్రహ్మాదిస్థావరాంతభూతములు నాయం దున్నవి కావు. ఐనను నాస్వరూపము యావత్తు ప్రపంచభూతములను భరించుచు వృద్ధిఁబొందించుచు నున్నప్పటికి నేనాభూతములతో సంబంధము కలవాఁడను గాను. ఈచమత్కార మయిననాస్వరూపమును దెలిసికొనుము. అంతట వ్యాపించియున్న మహావాయువాకాశమునం దేప్రకారముగా నడఁగియున్నదో యాప్రకారము సమస్తభూతప్రపంచములు నా యందున్న వని తెలియుము. ప్రళయకాలమునందు సమస్తభూతములు నాసంబంధమయినప్రకృతిలో లయించి పోవుచున్నవి. మరలసృష్టిప్రారంభములో సమస్తప్రపంచముల నేఁ బుట్టించుచున్నాను. అస్వతంత్ర మయి యీసమస్తభూతసమూహమును స్వకీయమయిన ప్రకృతియను మా

యు నవలంబించి యీప్రకృతిస్వభావమువలన మరల మరల నేను బు ట్టించుచున్నాను. ఈసృష్ట్యాదికర్మలయందు నాకభిమానము లేదు. లక్ష్యమును లేదు కనుక యీకర్మలు నన్నెంతమాత్రము బంధింపలే వు. సాక్షీభూత మయిననాచేత సమస్తచరాచరప్రపంచములుఁ బ్రకృతి యందుఁ బుట్టుచున్నవి. పైనఁ జెప్పిన నాసాక్షిత్వముచేతనే యీస మస్తప్రపంచము తిరుగుచున్నది. పరమాత్మస్వరూపమయి ప్రపంచని యామక మయిననాతత్వమును దెలియనిమూఢులు నేనుమనుష్యదే హము నవలంబించిన కారణముచేత నలక్ష్యము చేయుచున్నారు. అ ట్టిమూఢులు నిష్ప్రయోజనము లయినయాశలు గలవారుగా వ్యర్థ మయిన కర్మానుష్ఠాతలుగా నిష్ప్రయోజన మయినజ్ఞానము గలవారు గా నుండుటయే గాక హింసారూప మయినట్టియుఁ గామక్రోధలోభ మోహమదమాత్సర్యములతో నిండినట్టియు మోహనరూప మయిన ప్రకృతికి లోపడినవారై న న్నలక్ష్యముచేయుచున్నారు. మహాత్ము లయినపురుషులు దేవతాసంబంధ మైనసాత్వికప్రకృతి నాశ్రయించి భూతప్రపంచములకు ముఖ్యకారణమై నాశరహితమయిన నాతత్వ మును దెలిసికొని యితరచింతలు లేక నన్నే సేవించుచున్నారు. ఇం ద్రియనిగ్రహము గలిగి దృఢవ్రతు లయినకొంద ఱెడతెగని సమాధి చింతనముచే సమస్తకాలములయందు నన్ను స్మరించుచు భక్తిశ్రద్ధా యుక్తముగా వందనములు చేయుచు నన్ను సేవించుచున్నారు. మఱి కొందఱు వాసుదేవస్సర్వ మనుజ్ఞానయజ్ఞముచేఁ గొందఱు సర్వము బ్రహ్మ మనునద్వైతభావముచే మఱికొంద ఱుపాస్యోపాసకభావముచేఁ గొందఱు సమస్తదైవస్వరూపభావముచే నానావిధములుగా నన్ను సే వించుచున్నారు. జ్యోతిష్టోమాదిశ్రౌతకర్మము స్మార్తకర్మము పై తృకర్మము నోషధీవికారమయిన యన్నము మంత్రము నాజ్యాదిహ విస్సు నగ్నిహోత్రము హోమకర్మము నేనేచుమా. ఈసమస్తజగ త్తులకుఁ దల్లియుఁ దండ్రియుఁ గర్మఫలము విధించువాఁడు దాతయు దెలియఁదగినవస్తువుఁ బావనమయిన వస్తువు నోంకారవర్ణము ఋగ్య

జుస్సామవేదములు నేనేసు. కర్మఫలము పోషకుఁడు నీశ్వరుఁడు సర్వ
సాక్షి యునికిపట్టు నపకారియు మిత్రుఁడు నుత్పత్తి స్థితియు సంహార
ము నిక్షేపము జగత్తుల కుత్పత్తికారణమయిన నశింపనిబీజమును నేనే.
నన్నుష్ణముగా వర్షముగా వర్షమును నిలుపువాఁడనుగాను నమృ
తముగా మృత్యువుగా స్థూలసూక్ష్మములయిన ప్రకృతివికృతులుగా
సేవించుచున్నారు. ఎవ్వరు వేదత్రయవేత్తలై సోమపానముచేసి పాప
ములను నశింపఁజేసి యగ్నిష్టోమాదియజ్ఞములచేత నన్నుఁ బూజించి
స్వర్గప్రాప్తిని గోరుచున్నారో యట్టివారు పవిత్రమైన యింద్రలోకముఁ
బొంది దేవతాభోగముల ననుభవించుచున్నారు. అట్టివారు మహత్తైన
స్వర్గలోకభోగముల ననుభవించి వారి పూర్వోక్తకర్మఫలము క్షీణించి
న పిదప మరల నరలోకమున జన్మించుచున్నారు. ఈప్రకారము వే
దకర్మలఁగామ్యఫలముతో ననుష్ఠించువారు మర్త్యస్వర్గలోకములకుఁ
బోవుచు మరల వచ్చుచున్నారు. ఎవ్వ రితరాపేక్షలేక నన్నే శరణు
పొంది భజియించుచున్నారో యట్టియచంచలచిత్తుల యోగక్షేమము
ల నేనే కాపాడుచున్నాను. ఎవ్వ రితరదేవతాశ్రితులై భక్తిశ్రద్ధలతో
నాయాదేవతలఁ బూజించుచున్నారో యాజనులు మోక్షప్రాప్తియం
దాసక్తిలేనివారైనను నన్నే పూజించుచున్నా రని తెలియుము. సమస్త
శ్రౌతస్మార్తకర్మల ననుభవించువాఁడును వానికిఁ బ్రభువును నేనే. నా
యథార్థబ్రహ్మతత్త్వము నెఱుంగనివారు పైనఁ జెప్పిన కర్మఫలాను
భవములకు స్థానమైన స్వర్గలోకమునుండి మరల మర్త్యలోకమునకు వ
చ్చుచున్నారు. ఇంద్రాదిదేవతలను భక్తిశ్రద్ధలతోఁ బూజించువారిం
ద్రాదిదేవలోకములఁ బితృదేవతల నాశ్రయించిన వారు పితృలోకము
వినాయకాదిభూతములఁ బూజించువారు భూతగణలోకముఁ బొందు
చున్నారు. నన్ను భక్తిశ్రద్ధలతోఁ బూజించువారు నన్నే పొందుచు
న్నారు. ఎవ్వఁడు భక్తితో నాకుఁ బత్రమునైనఁ బుష్పమునైన ఫల
మునైన నుదకమునైనను సమర్పించుచున్నాఁడో యట్టి బుద్ధి గలిగిన
వానిచేత భక్తిపూర్వకముగా సమర్పింపఁబడిన యావస్తువులను నేను

భుజించుచున్నాను. నీవు చేయు కర్మను భుజియించు పదార్థములను హవిస్సులను దానములను దపస్సును నాకర్పితము చేయుము. నీవు పైనఁజెప్పినప్రకారము నివృత్తిమార్గముతోఁ గూడిన యాత్మ గలవాఁడవైనఁ గర్మసంబంధమైన శుభాశుభములలోనుండి తప్పించుకోఁగలవు. అట్లు కర్మఫలములలోనుండి విముక్తుఁడవైనపిదప నాస్థానమైన మోక్షమును బొందఁగలవు. నేను సర్వభూతములకు సముఁడను. నాకుఁ బ్రియుఁడుగాని ద్వేషిగాని లేఁడు. భక్తిశ్రద్ధలతో నన్ను భజించువాఁడు నాయందున్నవాఁడు. అట్టివానియందనుగ్రహరూపుఁడనైన నేనుండువాఁడను. అతిదురాచారము గలవాఁడైనను నితరమును భజింపక నన్నే శరణుపొంది భక్తిచేసెనేని యట్టివాఁడాత్మతత్త్వమెఱింగిన మద్భక్తుఁడు గనుక వాఁడు సదాచారి యనియే యెఱుంగుము. వాఁడతిత్వరలో ధర్మాత్ముఁడై నిత్యమైన పరమశాంతిని బొందుచున్నాఁడు. ఎట్టిదురాచారము గలిగిన నాభక్తుఁడు నాశమును బొందఁడని నీవు ప్రతిజ్ఞ చేయుము. నికృష్టజన్మములు గలవారు స్త్రీలు వైశ్యులు శూద్రులు నన్నే యాశ్రయించి భక్తిచేయువారైరేని వారుత్కృష్టమయిన గతిని బొందుచున్నారు. కావున పవిత్రులై భక్తితోఁ గూడుకొని యున్న బ్రాహ్మణశ్రేష్ఠులు రాజఋషులు నుత్కృష్టమయిన గతిని జెందువారనుటకు సందేహము లేదు. క్షణభంగురమయి తుచ్ఛసుఖములు గలయీమర్త్యలోకమునందు జన్మమెత్తిన నీవు నన్ను శరణుపొంది భజింపుము. నీవు నాయందు మనస్సు నిలిపి భక్తిచేసి నన్నుఁ బూజించి నాకు నమస్కారములు చేయుము. ఈప్రకారము నీవు సమస్తకాలములయందు భక్తిశ్రద్ధలతో స్థిరచిత్తము నుంచితివేని నన్నే పొందఁగలవు.

ఇట్లుపనిషదర్థరూపమయినట్టియుఁ బరబ్రహ్మవిద్యయైనట్టియు భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జునసంవాదరూపమయిన యోగశాస్త్రమునందు రాజవిద్యారాజగుహ్యయోగమను తొమ్మిదవయధ్యాయము ముగిసెను.



౧౦. విభూతియోగ మనుపదియవయధ్యాయము.

శ్రీకృష్ణమూర్తివారు చెప్పుచున్నారు. ఓయియర్జున! ప్రీతితో వినుచున్న నీకు మేలుచేయవలయు ననుకోరిక చేతను బరమోత్కృష్ట మయినయేవాక్యమును నేను జెప్పఁబోవుచున్నానో దానిని వినుము. ఇంద్రాదిదేవతలు మహర్షులు నాయుత్పత్తిస్థానము నెఱుంగరు. ఇంద్రాదిదేవతలకు మహర్షులకు నుత్పత్తికారణము నేనే గదా. నన్నాదిలేనివాఁడనియుఁ బుట్టువులేనివాఁడనియు సమస్తలోకులకు నియామకుఁడనియు నెఱిఁగి నతఁడు మోహము విడిచి సమస్తపాపములచేత విడువఁబడును. బుద్ధి జ్ఞానము మోహము లేకపోవుట యోర్పు సత్యము బాహ్యేంద్రియనిగ్రహము నంతరింద్రియనిగ్రహము శాంతి సుఖదుఃఖములు నుత్పత్తినాశములు భయము భయములేకపోవుట హింసచేయకపోవుట సమచిత్తత్వము సంతుష్టి తపస్సు దానము కీర్తి యపకీర్తి యీనానావిధములయిన గుణములు ప్రాణికోట్లకు నావలననే కలుగుచున్నవి. మఱియు భృగ్వాదిమహర్షిసప్తకంబు సనకసనందనాదిచతుష్టయంబు స్వాయంభువాదిమనువులు బ్రహ్మాత్మకుండ నగునావలన మద్గతభావము గలవారయి పుట్టిరి. వారివలన నీసమస్తలోకములయందుఁ జరాచరరూపము లయినభూతములు పుట్టెను. ఈపైనఁజెప్పిన నావిభూతిని యోగమహిమను జక్కఁగాఁ దెలిసికొనినవాఁ డచంచలయోగసిద్ధిని నిస్సంశయముగాఁ బొందును. సర్వసృష్టికి నుత్పత్తికారణుఁడను నేనే. నామహిమవలననే సమస్తప్రపంచములు జరగుచున్నవి. పండితులు నాభావము నీప్రకారముగాఁ దెలిసికొని నన్ను సేవించుచున్నారు. మఱియుఁ బండితులు నాయందుఁ జిత్తముగలిగి నాయందే ప్రాణముల సమర్పించి నాస్వభావమహిమలను దామెఱింగి యొకరికొకరుపదేశము చేసికొనుచు నాకథామృతమువలన సంతుష్టులయి బ్రహ్మానందము నొందుచున్నారు. ఈప్రకారము సర్వదా నాయందాసక్తిగలిగి విశ్వాసపూర్వకముగా సేవించు మహాత్ములకు నాలో నైక్యమొందుటకు హేతువైన జ్ఞానమును నేనిచ్చుచున్నాఁడను. అట్టిమహా

పురుషులకు మాత్రమే నేను దయచేసి నాసర్వవ్యాపక మైనజ్ఞానప్రకాశముచేత వారల ప్రకృతిసంబంధమైనయవివేకాంధకారమును నశింపఁజేయుచున్నాను. అర్జునుఁ డడుగుచున్నాఁడు. ఓయికృష్ణ ! నీవు పరబ్రహ్మమ వనియుఁ బరంధాముఁడ వనియుఁ బరమోత్కృష్టుఁడ వనియుఁ బరమపావనుఁడవనియుఁ బురాణపురుషుఁడ వనియుశాశ్వతుఁడ వనియు దివ్యమూర్తి వనియు దేవతలలో మొదటివాఁడ వనియుఁ బుట్టుక లేనివాఁడ వనియుఁ బ్రభువ వనిదేవర్షి నారదుఁడు, దేవలమహర్షి, యసితమహర్షి, వేదవ్యాసులు, మహర్షు లందఱు వర్ణించెదరు. నివున దేరీతిగా నీమహిమను నాకుఁ దెలియఁజేయుచున్నావు. నా కుపదేశించిన యావద్వాక్యములు సత్య మని నమ్ముచున్నాను. నీమహిమ దేవతులు గాని యసురులుగాని చక్కఁగాఁ దెలిసికొనఁజాలరు. నీవు ప్రాణులను వృద్ధిపొందించువాఁడవుప్రాణులకునియామకుఁడవు దేవదేవుఁడవు లోకనాయకుఁడవు పురుషశ్రేష్ఠుఁడవు. నీమహత్వము దెలియఁదగినవాఁడు నీవేగాని యొకఁడులేఁడు. నీస్వకీయమయిన మాహాత్మ్యములు విస్తారముగాఁ బ్రకాశించుచున్నవి. సమస్తలోకముల నేమాహాత్మ్యవిస్తారములచే నీవు వ్యాపించి ప్రకాశింపఁజేయుచున్నావో యవియన్నియు సవిస్తారముగాఁ దెలియఁజేయుటకు నీవే యర్హుఁడవు. ఓయి యోగీశ్వరా ! నిన్ను సమస్తవేళలయందు నేవిధముగా ధ్యానము చేసి తెలిసికోఁగలను ! నీ వేయేస్వరూపములు గలవాఁడవుగా ధ్యానము చేయఁదగినవాఁడవు. నీసర్వజ్ఞత్వవిభూతివిస్తారముల సవిస్తారముగా మరల నాకు సెలవిమ్ము. నీవాక్యామృతధార లెంతవినినను నాకుఁ దృప్తి లేదు. శ్రీకృష్ణమూర్తివారు చెప్పుచున్నారు. ఓయికురుశ్రేష్ఠ ! నామహిమ లనేకములు. వాని లెక్కింప నలవి గాదు. అయినను వానిలో ముఖ్యములయిన కొన్నిటిని జెప్పెదను వినుము. సమస్తభూతములహృదయమునం దున్నపరమాత్మస్వరూపిని నేనే. సమస్తభూతముల యుత్పత్తినాశములకుఁ గారణభూతుఁడను నేనే. ద్వాదశాదిత్యులలో విష్ణువను నాదిత్యుఁడు జ్యోతిస్స్వరూపములలోఁ గిరణములు

గలసూర్యుఁడు వాయువులలో మరీచియను వాయువు నక్షత్రములలోఁ జంద్రుఁడు వేదములలో సామవేదము దేవతలలో దేవేంద్రుఁడు నింద్రియములలో మనస్సు ప్రాణులలో బుద్ధి యేకాదశరుద్రులలో శంకరుఁడు యక్షరాక్షసగణములలోఁ గుబేరుఁడునష్టవసువులలోనగ్ని హోత్రుఁడు నున్నతపర్వతములలో మేరువు పురోహితులలో దేవపురోహితుఁడైనబృహస్పతి సేనానాయకులలోఁ గుమారస్వామి తటాకములలో సముద్రుఁడు మహర్షులలో భృగువు వాక్కులలో బ్రణవము యజ్ఞములలో జపయజ్ఞము స్థావరములలో హిమవత్పర్వతము వృక్షములలో నశ్వత్థము దేవర్షులలో నారదుఁడు గంధర్వులలోఁ జిత్రరథుఁడు సిద్ధులలోఁ గపిలమహాముని యశ్వములలో నమృతముతోఁ బుట్టిన యుచ్చైశ్శ్రవము గజశ్రేష్ఠములలో నైరావతము మనుష్యులలో రాజు నాయుధములలో వజ్రాయుధము గోవులలోఁ గామధేనువు ప్రాణులను బుట్టించు కాముఁడు సర్పముల రాజైన వాసుకిని నాగుబాముల ననంతుఁడు జలదేవతలవరుణుఁడు పితృదేవతల నర్యముఁడు దండించువారల యముఁడు దైత్యులఁబ్రహ్లాదుఁడు లెక్క పెట్టువారలఁ గాలము మృగముల సింహము పక్షుల గరుత్మంతుఁడు పరిశుద్ధవస్తువుల వాయువు ధనుర్ధరుల దశరథరాముఁడు మత్స్యములు మొదలగు జలజంతువుల మొసలి నదుల గంగానది సృష్టుల కాదిస్థితిలయములు విద్యలమోక్షవిద్య వాదజల్పవితండముల వాదము నక్షరముల నకారము సమాసముల ద్వంద్వసమాసము తుదలేనికాలము కర్మఫలదాయకుఁడైన విశ్వతోముఖుఁడను బ్రహ్మ సమస్తలోకముల నాశము చేయు మృత్యుదేవత యుత్పత్తి కాఁగల వస్తువుల కుత్పత్తిస్థానము స్త్రీలయందుఁ గీర్తి లక్ష్మి వాక్కు తెలివి బుద్ధి ధైర్యము నోర్పు సామవేదమునఁ బృహత్సామము ఛందస్సులలో గాయత్రీ ఛందస్సు మాసముల మార్గశీర్షమాసము ఋతువులవసంతఋతువు వంచకము లైనవానిలో జూదము తేజోవంతుల తేజస్సు సాత్వికులసత్వగుణము జయము దార్ఢ్యము నుద్యోగము యాదవులలో వాసుదేవుఁడు పాండవులలో నర్జునుఁడు నైననీవు మునుల వేదవ్యా

సమహాముని శాస్త్రార్థముల నెఱింగినవారిలో శుక్రాచార్యులు దండిం చువారల దండనీతి జయింప నిచ్ఛయించిన వారల జయోపాయము లు గోప్యమైనవస్తుల మౌనము జ్ఞానవంతుల జ్ఞానము సమస్త భూతము లకుబీజమును నేనే నేఁగానిచరాచరభూతములు లేనేలేవు. నామహాత్మ్యవి స్తారములకుఁబరిమితము లేదు. అయినను నీకు సంక్షేపముగాఁ దెలియఁ జేసితిని. లోకమునం దైశ్వర్యయుక్తమై బలపరాక్రమయుక్తమై యు త్సాహయుక్తమై కాంతియుక్తమై యేయేవస్తువులు గలవో యవి యీ వత్తు నా తేజోభాగసంభవములుగాఁ దెలిసికొనుము. నామాహాత్మ్యవి స్తారముల వేర్వేఱుగా వివరింపవలసిన యవశ్యము లేదు. వానిసవిస్తా రముగాఁ దెలియవలసిన పని నీకు లేదు. సమస్తప్రపంచములు నాయ నేకాంశములలో నొకయంశముచేతనే వ్యాపింపఁబడియున్న వని తె లియుము.

ఇట్లుపనిషదార్థవ మైనట్టియుఁ బరబ్రహ్మవిద్య యయినట్టి యు భగవద్గీత లనెడుశ్రీకృష్ణార్జునసంవాదరూప మయిన యోగశా స్త్రమునందు విభూతియోగ మనుపదియవయధ్యాయము ముగిసెను.



## ౧౧. విశ్వరూపసందర్శనయోగ మనుపదునొకండవయధ్యాయము.

అర్జునుం డడుగుచున్నాఁడు. ఓయి శ్రీకృష్ణమూర్తీ! న న్ననుగ్రహించుకొఱకు నీవు చెప్పిన యుత్కృష్టమై రహస్యమై యా త్మానాత్మవస్తువివేకజ్ఞానమయిన యుపదేశవాక్యములవలననాయజ్ఞాన ము తొలఁగిపోయినది. నీవలన భూతజాలముల యుత్పత్తి నాశములు సవిస్తారముగా వినుటయే గాక క్షయరహితమయిన నీమహిమఁ జక్కఁ గా వింటిని. నీవు పలికినది యథార్థమే నీయాత్మరూప మెట్టి దని తెలియఁజేసితివో యట్టిమహిమగల నీస్వరూపమును జూచుటకు మి క్కిలి కోరియున్నాను. అట్టిమహిమ గలనీదివ్యస్వరూపముం జూచుట కు నాకుశక్య మని తలంచితివేని నీ యవ్యయమయిన దివ్యస్వరూపము నాకుఁ జూపుము. శ్రీకృష్ణమూర్తివారు చెప్పుచున్నారు. ఓయిపార్థ!

దివ్యములయి యనేకవిధములయి నానావర్ణములు గలిగి యనేకవిశేషములుగలవయి యనేకసంఖ్యలుగల నాస్వరూపములను జూడుము. ద్వాదశాదిత్యుల నష్టవసువుల నేకాదశరుద్రుల నశ్వినీ దేవతల సప్తవాయువులం జూడుము. ఇదివఱకెన్నండు నీవు చూడని యనేకసంఖ్యలు గలయద్భుతముల నిప్పుడు చూడుము. మఱియుం జరాచరం బగు సమస్తప్రపంచంబు నొక్కస్థానమైన నాదివ్యదేహంబునందుం జూడుము. ఇవిగాక జయపరాజయములు నేయేవిషయముల నీవు చూడనిచ్ఛయించియున్నావో వానినన్నిటినిజూడుము. ఈప్రాకృతము లయిననీ కన్నులతో నాదివ్యస్వరూపముం జూడనేరవు, నీకు దివ్యదృష్టి ననుగ్రహించుచున్నాను. దానివలన నద్భుతమయిన నాయోగశక్తిని గనుము. సంజయుండు చెప్పుచున్నాఁడు. ధృతరాష్ట్రమహారాజా! మహాయోగీశ్వరుం డయినశ్రీకృష్ణుఁడు పైనఁజెప్పినరీతిగాఁ బలికి సర్వోత్కృష్టమయి దివ్యమయిన తనవిశ్వస్వరూపము నర్జునునకొఱకుఁ గనఁబఱచెను. ఆస్వరూప మనేకముఖములతో నేత్రములతో నద్భుతములతో బహువిధదివ్య భూషణములతో ననేకదివ్యాయుధములతో దివ్యహారములతో వస్త్రములతో దివ్యపరిమళము గలగంధములతోను గూడుకొని యంతటను ముఖములుగలదయి యద్భుతమై యంత్యములేనిదయిన స్వరూపము నర్జునుఁడు చూచెను. ఆదివ్యస్వరూపకాంతి యేకకాలమునందు వేయిమందిసూర్యు లాకాశమునందుఁ బ్రకాశించి నట్లుండెను. బహుప్రకారములుగా వేర్వేఱువిధములుగా నేర్పఱచియుండు సమస్తజగత్తులు దేవదేవుఁ డయినకృష్ణమూర్తిశరీరమునం దొక్కటిగాఁ బోగయి యుండ నర్జునుఁడు చూచి చిత్తవిభ్రాంతిని బొంది దేహమున గగ్గురుపాటు గలవాఁడయి విశ్వరూపధరుఁ డయిన శ్రీకృష్ణమూర్తికి శిరసా నమస్కరించి చేతులు ముకుళించి "ఓదేవ నీ దేహమునందు సమస్త దేవతలు ప్రాణికోట్లు కమలాసనుఁడగు చతుర్ముఖబ్రహ్మ మహర్షులు దేవసర్పములు వాసుకి మొదలగువారుఁ గనఁబడుచున్నారు. జగత్తులను నియామకుఁడ వైనయో దేవ నీదివ్యస్వరూ

పమున ననేకబాహువులు నుదరములు ముఖములు నేత్రములు గలిగి యున్నవి. నీయాకార మపరిమితముగా నంతట వ్యాపించియున్నది. నీస్వరూపమునకుఁ దుద మొదలు మధ్యభాగము నాకుఁ గనంబడ లేదు. కిరీటమును గదాచక్రములను ధరియించిన నీవిశ్వరూపము జ్యోతిర్మయమయి యగ్ని సూర్యులకు సమానముగా నంతటఁ బ్రజ్వలించుచున్నది. అపరిచ్ఛేద్య మయిననీస్వరూపముం జూచుటకు మిక్కిలి యశక్యముగానున్నది. నీవు పరమోత్కృష్టమైనపరబ్రహ్మమని సమస్తజగత్తులకు నుత్కృష్టమైన యాశ్రయ మని నాశరహితుఁడ వని యాశ్రితధర్మరక్షకుఁడ వనియుఁ బురాణపురుషుఁ డవని తెలియఁదగిన వాఁడవు. ఓవిశ్వేశ్వర! నీ వాదిమధ్యాంతములు లేనివాఁడవై యపరిమితపరాక్రమము గలవాఁడవై యనేకబాహువులు గలిగి సూర్యచంద్రులను నేత్రములుగా ధరియించి ప్రజ్వలించుచున్న యగ్నియే ముఖమునందుఁ గలవాఁడవై యీసమస్తప్రపంచముల నీకాంతిచేతఁ దపింపఁజేయువాఁడవుగా నాకుఁ గనంబడుచున్నావు. ఒక్క నీస్వరూపముచేత భూమి యాకాశము నంతరాళము వ్యాపింపఁబడియున్నవి. సమస్తదిక్కులు వ్యాపించిన మహానుభావా! అద్భుతముగా నతిభయంకరముగా నుండునీస్వరూపముంజూచి స్వర్గమర్త్యపాతాళములు మూఁడును గడగడ వణఁకుచున్నవి. నీదివ్యస్వరూప మైనవిశ్వరూపమునందు దేవసమూహములు శరణుచొచ్చుచున్నవి. అందుఁ గొందఱు భయముచెంది యంజలిబద్ధులయి స్తోత్రము చేయుచున్నారు. మహర్షులు సిద్ధపురుషులు నీకు జయప్రదవాక్యములు చెప్పుచు నిన్ననేకవిధములుగా సంపూర్ణమయిన స్తోత్రమును జేయుచున్నారు. ఏకాదశరుద్రులు ద్వాదశాదిత్యులు నష్టవసువులు సాధ్యులు విశ్వేదేవతలు నశ్వినీదేవతలు సప్తవాయువులుఁ బితృదేవతలు గంధర్వయక్షరాక్షససిద్ధసమూహములు నాశ్చర్యముగఁ జూచుచున్నారు. అనేకముఖములు నేత్రములు చేతులు తొడలు పాదములు కడుపులు భయంకరమయిన కోరలు గలని యమితాకారముం జూచి సమస్తప్రాణులు నేను మిక్కిలి భయపడు

చున్నారము. ఆకాశమును దాఁకుచున్నట్టియుఁ బ్రజ్వలించుచున్నట్టి
యు నానావర్ణములు గలిగినట్టియుఁ దెఱవఁబడియుండునోళ్ళుగలిగిన
ట్టియుఁ బ్రకాశించెడు విశాలనేత్రములు గలిగినట్టియు నీస్వరూపము
ను జూచి నామనస్సు భీతిని బొందియున్నది గనుక నాకు ధైర్యమును
మనస్తుష్టియు లేకయున్నవి. కోరలచే భయంకరములయిన ప్రళయా
గ్నిసమానము లయిన నీముఖములను గనుటవలన నాకు దిక్కులు తె
లియకున్నవి. పైఁగా నాకు సుఖము లేకయున్నది. జగదాధారుఁడ
వయినయో దేవ! నీవు నాయందు దయచేసి నాకుఁ బ్రసన్నుఁడవు గ
మ్ము. ఈయాంబికేయపుత్రులు దుర్యోధనాదులు భూపాలకు లయిన
రాజసమూహములు భీష్మద్రోణాచార్యులును సూతపుత్రుఁడయిన క
ర్ణుఁడు నాసేనానాయకులు నందఱు గుంపులుచేరి యతివేగముగ భ
యంకరము లయిననీముఖములయందుఁ బ్రవేశించుచున్నారు. వారి
లోఁ గొందఱు నీదంతముల సందులయందుఁ జిక్కి శిరస్సులు పొడిపొ
డిగాఁ జేయఁబడినట్లు కనంబడుచున్నారు. ఆనేకము లయినప్రాణ
ప్రవాహనదులు వేగముతో సముద్రమునం దెట్లు ప్రవేశించుచున్న
వో యాకీతిగా నీశూరులెల్లరుఁ బ్రజ్వలించుచున్ననీయందుఁ బ్రవే
శించుచున్నారు. జ్వలించుచున్న నీముఖములచేత సమస్తజనులను
మ్రింగుచు నన్నిదిక్కుల యందు నీనాలుకలతోఁ బ్రాణుల నీడ్చి
కొనుచున్నావు. నీభయంకరకాంతులు సమస్తజగత్తులు నిండి వా
నిని దహింపఁజేయుచున్నవి. దేవదేవ! నీకు సాష్టాంగ నమస్కార
ములు. దయచేసి నాకుఁ బ్రసన్నుఁడవు గమ్ము. నీ కిప్పుడు గలిగి
యుండు ప్రవృత్తికిఁ గారణము నాకుఁ దెలియలేదు. ఈభయంకరస్వ
రూపము గలనీ వెవ్వఁడవు? ఆద్యుఁడ వగునిన్నుఁ దెలిసికొనవలె నని
కోరుచున్నాను. దయతోఁ జెప్పుము" అనియెను. శ్రీకృష్ణమూర్తి
జెప్పుచున్నాఁడు. ధనంజయా! లోకముల నెల్ల నశింపఁజేయు ప్రబల
కాలస్వరూపుఁడను. ఇప్పు డీలోకముల సంహరించుట కుద్యుక్తుఁడ నైతి
ని. ఈయుభయసేనలయందు యుద్ధముఁ జేయుటకు వచ్చిన వారలలో నీ

వు దక్క మఱియెవ్వరును బ్రతుకగలవారు లేరు గనుక నీవు యుద్ధముఁ జేయుటకు లెమ్ము. నీశత్రువులనందఱి గెల్చి కీర్తిని బొంది యేకచ్ఛత్రాధిపత్యముగా రాజ్యము ననుభవింపుము. నీశత్రువులు నాచేతమునుపే సంహరింపఁబడిరి. కనుక నీవు కారణమాత్రుఁడవుగా నుండుము. ఇదివఱకే నాచేతఁ జంపఁబడిన ద్రోణాచార్యులను భీష్ములను సైంధవుని కర్ణుని ననేక శూరులను గెలువుము. నీకు విచార మొందుటకుఁ బనిలేదు. యుద్ధములో నీవు శత్రువుల గెలువఁగలవు. ధృతరాష్ట్రమహారాజ! యిట్లు శ్రీకృష్ణుఁడు చెప్పఁగా నర్జునుఁడు గడగడవణంకుచు నామాటలను విని నమస్కారముచేసి దోసిలి పట్టుకొని మాటిమాటికి భయపడుచు నమస్కరించుచు శ్రీకృష్ణమూర్తివారితో "శ్రీకృష్ణా! నీవింతటి మహాపురుషుఁడవు కనుకనే నిన్ను సమస్తలోకములుఁ గీర్తించి సంతోషము నొందుచున్నవి. నీయం దధికశ్రద్ధాభక్తులు చేయుచున్నవి. రాక్షసులు నిన్నుఁ జూచి భయమునొంది నానాదిక్కులకుఁ బాఱిపోవుచున్నారు. సిద్ధపురుషులు నీకు నమస్కారములొనర్చుచున్నారు. జగన్నాథ! పరమశ్రేష్ఠుఁడవయి బ్రహ్మదేవునకాదికారణభూతుఁడ వయిననిన్ను సమస్తప్రపంచములుఁ బూజించుట సహజమయినది. నీ వనంతుఁడవు, జగత్తుల కాధారభూతుఁడవు, నాశము లేనివాఁడవు, సదసత్తు లనుజీవశరీరంబుకంటె నుత్కృష్టమయిన పరబ్రహ్మస్వరూపుఁడవు; నీవుసమస్త దేవతలకు నాదిదేవుఁడవు. పురాణపురుషుఁడవు; ఈసమస్తజగత్తులకుఁ బరమాధారభూతుండవు; విశ్వవేత్తవు; మహానుభావు లయినపురుషులచేఁ బొందఁదగిన మోక్షస్థానము నీవే, యీగిజములు నీవలన వ్యాపింపఁబడియున్నవి. వాయువు నగ్ని వరుణుఁడు చంద్రుఁడు బ్రహ్మ బ్రహ్మకుఁదండ్రియయిన మహావిష్ణువు నీవే. నీకు వేయిమాఱ్లునమస్కారములు. పలుమాఱు నతులు. మరల మరల జోహారులు. ముందుప్రక్కనుండి, వెనుకనుండి సమస్తదిక్కులనుండి నమస్కారములు. అమితసామర్థ్యపరాక్రమములు గలిగిన నీవు సమస్తమునందుఁ బూర్ణముగా వ్యాపించి యున్నందున సర్వస్వ

రూపుఁడవు నీవే. నీమహిమల నిదివఱకుఁ దెలియక పోయినందున నాయజ్ఞానముచే నినుస్నేహితుఁడవని తలఁచి కృష్ణ! యాదవ! సఖుఁడా! యని సాధారణముగాఁ బిలిచిన పిలుచుటలను నాయందుఁ గటాక్షించి క్షమింపవలయును. నీ వప్రమేయుండ వని తెలియక యేకాంతంబున నేమి యితరులసమక్షంబున నేమి పరిహాసార్థముగా విహారశయ్యాసనభోజనవేళలయందుఁ దిరస్కారముగా మాటలాడిన యపరాధముల క్షమింపవలయు. నీవు సమానములేని ప్రభావముగలవాఁడవు చరాచరరూపము లగుసమస్తప్రాణులకుఁ దండ్రివి పూజార్హుఁడవు పరమగురుఁడవు స్వర్గమర్త్యపాతాళలోకంబుల నీకు సమానుఁడు లేఁడు, అధికుఁ డెక్కడఁ గలఁడు! స్తోత్రార్హుఁడ వయిననీకు సాష్టాంగముగా నమస్కరించి నాకుఁ బ్రసన్నుండవు గావలయు నని ప్రార్థించుచున్నాను. నేఁ జేసినసమస్తాపరాధములఁ బుత్త్రునితప్పులను దండ్రివలెఁ జెలికానితప్పులను జెలికాఁడువలె నాయకితప్పుల నాయకుఁడు వలె నీవు సహించి మన్నింపవలయు. జగన్నాయక! యిదివఱలో నెవ్వఁడు ను జూడని నీవిశ్వరూపమును దర్శించి మిక్కిలి యానందభరితుఁడ నయితిని. ఐనను నామనస్సు బహుభీతిని బొందియున్నది. ఎప్పటిరూపమున నాకు దర్శనమిమ్ము. దేవదేవ! జగదాధారభూతుఁడ వయినస్వామీ! నాకుఁ బ్రసన్నుఁడవు కమ్ము. అనేకభుజములు గలిగి విశ్వరూపధరుఁడ వయినయోస్వామీ! కిరీటము చక్రము గదయు ధరించిన నీసహజరూపమును దర్శనముచేయుటకుఁ జాలఁగోరియున్నాను గనుక దయచేసి చతుర్భుజ మయినరూపముం జూపుము. శ్రీకృష్ణమూర్తిగారు చెప్పుచున్నారు. ఓయి నీయందు దయచేసి నాయోగసామర్థ్యమువలనఁ దుద మొదలు లేనిది యు ననాది యుఁ దేజోమయ మయినట్టిదియు నీకంటె నితరులచే నింతకుమునుపు చూడఁబడనిదియుఁ బరమోత్కృష్ట మయినదియు నయిన నావిశ్వరూపముఁ జూపితిని. ఈమహత్తయిన రూపమును మనుష్యలోకమునందు నీ కొక్కనికే చూపితిని. మఱియొక కొంత వేదయజ్ఞాధ్యయనాదులు చేసిన నన్ని

దానములు చేసిన నెంతకర్మనిష్ఠులయిన నెంతయుగ్రతపస్సు గలవారయిన వారికి దర్శన మిచ్చువాఁడను గాను. భయంకర మయిననావిశ్వరూపముం జూచినందున నీకుఁ గలిగినభయమును జిత్తవిభ్రాంతిని వదలుము. నిర్భీతుఁడవయి సంతుష్టమనస్కుఁడవయి నాసహజరూపమును జూడుము. సంజయుఁడు ధృతరాష్ట్రునితో మహారాజా! శ్రీహరి యర్జునుం జూచి యీప్రకారముగాఁబలికి తనసహజరూపమును గనఁబఱచి భయపడియున్న యర్జునను నూఱడించెను. అర్జునుఁడుపలికెను. జనార్దన! యిప్పుడు సౌమ్యమయిన నీమనుష్యరూపమును గని నాబుద్ధి స్థిరపడినది. మనుష్యులలోఁగలసితిని. శ్రీకృష్ణమూర్తిగారు చెప్పుచున్నారు. పాండవ! నీకుదర్శనమిచ్చిన నాస్వరూప మధికదుర్లభ మయినది. ఇట్టివిశ్వరూపమును దర్శించుటకు దేవత లెప్పుడును గోరుచున్నారు నీకు దర్శనమిచ్చిన విశ్వరూపము వేదము చదివినవారలకుఁ గాని తపస్సుచేసినవారలకుఁ గాని యజ్ఞములఁ జేసినవారలకుఁ గాని లభింపదు. శత్రుతాపనుఁడ వైన యర్జునా! విశ్వరూపధరుఁడ నయినన న్నితరాసక్తిలేని యచంచలభక్తిచేత మాత్రమే తెలిసికొనవచ్చును. చూడవచ్చును. పొందవచ్చును. ఇతరసాధనములు లేవు. ఏపురుషుఁడు నాకొఱకు సత్కర్మలొనర్చి నేనే యుత్కృష్టగతి యని నమ్మి సర్వప్రకారములచేతఁ బూజించి ధనబంధుపుత్రమిత్రకళత్రాదిసంగములయం దాసక్తి విడిచి సర్వప్రాణులయందు వైషమ్యము లేక యుండునో వాఁడు నన్నుఁ బొందుచున్నాఁడు.

ఇట్లుపనిషద్రూపమయినట్టి యుఁ బరబ్రహ్మవిద్య యయినట్టియు భగవద్గీత లనెడుశ్రీకృష్ణార్జునసంవాదరూప మయినయోగశాస్త్రమునందు విశ్వరూపసందర్శనయోగ మను పదునొకండవయధ్యాయము ముగిసెను.

## ౧౨. భక్తియోగ మనుపదిరెండవయధ్యాయము.

అర్జునుఁ డడుగుచున్నాఁడు. వాసుదేవ! పయినఁజెప్పినప్రకారము భగవత్ప్రీతిగా నిరంతరము కర్మలంజేయుచు నిన్ను సదాధ్యా

నముచేయువారలలో నింద్రియములకు గోచరముగాని పరబ్రహ్మాను సంధానముఁ జేయువారలలో యోగిశ్రేష్ఠులెవ్వరు? శ్రీకృష్ణమూర్తి వారు చెప్పుచున్నారు. పాండవా! యెవ్వరు నాయందు మనస్సు నిలిపి నిరంతరసమాహితచిత్తులై పరమశ్రద్ధతోఁ గూడుకొని నన్ను ధ్యానము చేయుచున్నారో యట్టియుత్తమపురుషులు నాకు సమ్మతులు. ఎవ్వరు సమస్తకాలములయందు నింద్రియనిగ్రహము గలిగి సమబుద్ధితో సమస్తప్రాణిహితమునందాసక్తి గలిగి నాశరహితమయినట్టియు నిర్దేశింపఁగూడనట్టియు రూపరహితమయినట్టియు నంతటవ్యాపించియున్నట్టియు ధ్యానింప శక్యము గానట్టియుఁ బ్రకృతియం దున్నట్టియుఁ జలింపనట్టియు శాశ్వతమయిన పరబ్రహ్మము నుపాసనచేయుచున్నారో వారు నన్నే పొందుచున్నారు. ఆపరబ్రహ్మాసక్తచిత్తుల కధికతరకష్టము గలుగును. దేహాభిమానుల కధికకష్టములు గలుగకయే పరబ్రహ్మనిష్ఠ సిద్ధింపదు. నన్నే సర్వోత్కృష్టగతిఁగాఁ దలఁచి సమస్తకర్మల నాకు సమర్పణచేసి తమబుద్ధియందు నన్ను నిలిపి ధ్యానముచేసెదరో వారల నతిశీఘ్రముగా మృత్యుమయసంసారసాగరమును దాఁటించువాఁడను. నీమనస్సును బుద్ధిని నాయందూర్జితముగా నిలుపుము. అట్లు చేసితివేని యీదేహము సరించిననిమ్మట నిస్సందేహముగా నన్నే పొందుచున్నావు. పైనఁ జెప్పినరీతిగా నీమనోబుద్ధులను నాయందు దృఢముగా నిలుపుట కశక్తుఁడవైతివేని నన్నుఁ బొందవలె ననుకోరిక గలిగి మెల్ల మెల్లగా నభ్యాసము చేయుము. అట్లు చేయుటకుఁ గూడ సామర్థ్యము లేకపోయిన నావిషయమగు సమస్తకర్మలు గావింపుము. అట్లు నాప్రీత్యర్థము చేసితివేని నీకు మోక్షము గలుగును. అందుకును నశక్తుఁడవయితివేని నన్నే యాశ్రయించి స్థిరచిత్తమున నాయందు భారమువేసి నీవు చేయుకర్మఫలమును నాకర్పింపుము. అభ్యాసయోగమునకంటె జ్ఞానము జ్ఞానముకంటె ధ్యానము ధ్యానముకంటెఁ గర్మఫలత్యాగము శ్రేష్ఠములు. అట్టికర్మఫలత్యాగమున మోక్షము ప్రాప్తమగును. సమస్తభూతములయందు ద్వేషము

లేనివాఁడు సమస్తప్రాణులకు మిత్రుఁడు దయగలవాఁడు మమకారాహంకారములు లేనివాఁడు సుఖదుఃఖములు సమానముగాఁ గనువాఁడు నోర్పుగలవాఁడు నిత్యసంతోషి ధ్యానపరుఁడు నచంచలమనోవృత్తిగలవాఁడు సంశయములేనివాఁడు నాయందు మనోబుద్ధుల నుంచినభక్తుఁడెవ్వఁడో యాతఁడు నాకాప్తుఁడు; తనవలన సర్వజనులకు సర్వజనులవలనఁ దనకు భయములేకపోయి సంతోషమును భయము నసూయయు లేనివాఁడయి యుండునో యట్టివాఁడు నాకుఁ బరమాప్తుఁడు. ఎవ్వఁడు కోరికలు లేక పవిత్రుఁడయి సామర్థ్యము గలిగి పక్షపాతములేక నిర్భయుఁడై కర్మఫలములు గోరక నాకుఁ భక్తుఁడుగా నుండునో వాఁడు నాకుఁ బరమాప్తుఁడు. ఎవ్వఁడు సంతోషమునకు ద్వేషమునకు దుఃఖమునకు నాశకు శుభాశుభములకు రహితుఁడయి నాయందు భక్తిచేయుచున్నాఁడో యట్టివాఁడు నాకుఁబరమాప్తుఁడు. ఎవ్వఁడు శత్రుమిత్రులయందు మానావమానములయందు శీతోష్ణములయందు సుఖదుఃఖములయందు సమానుఁడై సంగరహితుఁడై నిందాస్తుతులయందు సమానుఁడై మౌనముధరించి యదృచ్ఛాలాభసంతుష్టిని నివాసరహిత నిశ్చయబుద్ధిని నాయందు భక్తిచేయుచున్నాఁడో వాఁడు నాకుఁ బరమాప్తుఁడు. ఎవరు నేనే తమకుఁ బరమగతి యని నమ్మి యీయమృతవాక్యములను విశ్వసించి నేను జెప్పినప్రకారము శ్రద్ధతో నడచుకొనుచున్నారో యాభక్తులు నాకంతకంటెఁ బరమాప్తులు.

ఇది యుపనిషద్రూప మయినట్టియుఁ బరబ్రహ్మవిద్య యయినట్టియు భగవద్గీత లను శ్రీకృష్ణార్జునసంవాదరూప మయిన యోగశాస్త్రమునందు భక్తియోగ మనుపండ్రెండవయధ్యాయము ముగిసెను.



## ౧౩. క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగ మనుపదుమూఁడవయధ్యాయము.

అర్జునుఁ డడుగుచున్నాఁడు. కేశవా ప్రకృతియనఁగా నేది? పురుషుఁ డనఁగా నెవ్వఁడు? క్షేత్రమనఁగా నెట్టిది? క్షేత్రజ్ఞుఁ డనఁగా నెవ్వఁడు? జ్ఞాన మనఁగా నేమి? జ్ఞేయ మనఁగా నెట్టిది? ఇవి సమ

స్తము చక్కగాఁ దెలియఁ గోరుచున్నాను. శ్రీకృష్ణమూర్తివారు చెప్పుచున్నారు. కౌంతేయా! క్షేత్రమనఁగా దేహమనియు క్షేత్రజ్ఞుఁడనఁగా దేహముం దెలిసికొనువాఁ డనియుఁ బెద్దలు చెప్పుచున్నారు. సర్వక్షేత్రములయందు క్షేత్రజ్ఞుఁడు నేనే యని తెలిసికొనుము. క్షేత్రమును దదంతర్గతుఁ డయినక్షేత్రజ్ఞుని దెలియుటయే జ్ఞాన మని చెప్పఁబడుచున్నది. ఆక్షేత్ర మేదిగనో దానిస్వభావ మెట్టిదో దాని వికారము లెవ్వియో యేకారణముచే నది యుత్పత్తియయినదో వానిని క్షేత్రజ్ఞుని వానిస్వభావమును సంక్షేపముగాఁ జెప్పుచున్నాను. క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపనిర్ణయములు మహర్షులవలన వేదములవలన ననేకవిధములుగాఁ జెప్పఁబడియున్నవి. ఇంతియేకాదు సందేహమునకాస్పదములేని బ్రహ్మసూత్రములవలన నెఱింగింపఁబడియున్నవి. పంచభూతములయిన పృథివి జలము తేజస్సు వాయువు నాకాశము, నహంకారము బుద్ధి మాయయు, జ్ఞానేంద్రియము లయిన త్వక్కు చక్షువు శ్రోత్రము జిహ్వా ఘ్రాణములును, కర్మేంద్రియము లయిన వాక్కు పాదము పాణి పాయువు ఉపస్థమును మనస్సు నింద్రియగోచరంబు లగుశబ్దస్పర్శరూపరసగంధము లయినపంచతన్మాత్రలు నివి యన్నియుఁ జేరి యిరువదినాలుగుతత్వములాయెను. కోరిక ద్వేషము సుఖము దుఃఖము దేహేంద్రియసమూహము మనోవృత్తి ధైర్యము నను వికారములతోఁ గూడిన యిరువదినాలుగుతత్వములు క్షేత్రమని సంగ్రహముగాఁ జెప్పఁబడినది. తన్నుఁ దాను పొగడుకొనకుండుట తనధర్మముఁ దాను బ్రకాశముచేసికొనకుండుట హింసచేయకయుండుట క్షమ, కృత్రిమములేకపోవుట, గురుసేవ బాహ్యాభ్యంతరశుద్ధి యచంచలత, మనోనిగ్రహము గలుగుట, యింద్రియవిషయములయం దాశలేకయుండుట, యహంకారములేకయుండుట, జన్మము మరణము ముసలితనము, రోగము, దుఃఖము వీనియందుఁ గలదోషముల నాలోచించి తెలిసికొనుట పుత్రదారగృహాదులతో సంగము లేనివాఁడై వానికిఁ గలుగుసుఖదుఃఖములు తనవిగావని యెంచుట యిష్టానిష్టప్రాప్తులయందు

సర్వదా సమచిత్తత్వము గలుగుట, యితరదేవతారాధనయందు మనస్సు చలింపక నేనే గతి యని నమ్మి నాయందు గాఢమయిన భక్తి చేయుట విజనస్థలవాసియగుట, జనసమూహమునం దనురాగము లేకుంట యాత్మజ్ఞానమునందు నిత్యభావము గలుగుట, మోక్షప్రాప్తి యందే ప్రయోజనదృష్టి యుండుట, యివియన్నియు జ్ఞాన మని పెద్దలు చెప్పుదురు. వీనికంటె నితరము లజ్ఞానముని చెప్పఁబడును. ఇఁకఁ దెలిసికొనఁదగిన వస్తు వేదియో దానిని జెప్పుచున్నాను. దానిం దెలిసిన మోక్షప్రాప్తియగును. దానినే బ్రహ్మ మని చెప్పుచున్నారు. ఆబ్రహ్మ మాదిలేనిది పరమోత్కృష్టమయినది. వేదవిహిత మగుటచే సత్తయిన ఘటపటాదులకంటె నసత్తయిన శశవిషాణాదులకంటెను విలక్షణమయినది. సర్వదిక్కులయందుఁ జేతులు కాళ్ళు నేత్రములు శిరస్సులు ముఖములు చెవులుఁ గలిగి సమస్తప్రపంచమును వ్యాపించి యుండునది. ఆబ్రహ్మము సకలేంద్రియవ్యాపారములచేఁ బ్రకాశించుదానివలె నుండియు వానితో సంబంధములేనిది. సమస్తప్రపంచములు ధరించియు నెందు నంటక యుండునది యుఁ ద్రిగుణాత్మకముగాని దయ్యు సత్త్వరజస్తమోగుణముల ననుభవించునట్టిది. సమస్తచరాచరములయందు వెలుపల లోపల నుండియుండునది. మిక్కిలి సూక్ష్మమ యినది గనుక తెలిసికొనుట కశక్యమయినది. అజ్ఞానికి దూరముగా జ్ఞానికి సమీపముగా నుండునది. అపరిచ్ఛిన్న మయినదయినను సమస్తజీవకోట్లయందును బరిచ్ఛిన్న మయినదానివలె నుండునట్టిది. సమస్తభూతములను భరించునది గ్రసించునట్టిది మరల నుత్పత్తిఁ జేయునట్టిది యని తెలిసికొనుము. జ్యోతిస్స్వరూపు లయినసూర్యాదులఁ బ్రకాశింపఁజేయునట్టిది. అజ్ఞానమునకు వ్యతిరిక్త మయిన దని తెలియఁదగిన దనియు జ్ఞానగోచరమయిన దనియు సమస్తప్రాణులయొక్క హృదయములయందు నున్నదనియుఁ బెద్దలు చెప్పుదురు. ఈప్రకారము క్షేత్రమును జ్ఞానమును జ్ఞేయమును సంగ్రహముగా నీకుఁ జెప్పితిని. ఈ భావముం దెలిసికొనిన నాభక్తుఁడు నాస్థాన మయినమోక్షమున కర్హుఁ

డగుచున్నాఁడు. ప్రకృతిపురుషు లిరువురు ననాదు లని తెలిసికొనుము. మనోబుద్ధులకుఁ గలుగువికారములు సత్త్వరజస్తమోగుణములు మూలప్రకృతివలనఁ గలిగినవిగాఁ దెలిసికొనుము. ప్రకృతికి మాయ యని పేరు గలదు. ఆమాయ శరీరసుఖదుఃఖాదులఁ బుట్టించుటకుఁ గారణ మని తెలిసికొనుము. క్షేత్రజ్ఞుఁ డనుపురుషుఁడు సుఖదుఃఖముల ననుభవించుటయందుఁ గారణ మని తెలిసికొనుము. క్షేత్రజ్ఞుఁ డనుపురుషుఁడు క్షేత్రమం దున్నవాఁడు ప్రకృతివలనఁ బుట్టినగుణములను పురుషుఁ డనుభవించుచున్నాఁడు. ఈపురుషునికి సుఖదుఃఖరూపము లైనగుణములయం దాసక్తి యుండుటచేతఁ బుణ్యాపుణ్యరూపములయినయోనులయందు జన్మములకుఁ గారణ మగుచున్నది. ఈక్షేత్ర మనెడిదేహమునందు క్షేత్రజ్ఞుఁ డనువాఁడు కార్యకరణవ్యాపారములయం దుపద్రష్టయై యనుమోదించుచున్నవాఁడయి భరించుచున్నవాఁడయి యనుభవించువాఁడయి నియామకుఁడయి యుత్కృష్టుఁడయి పరమాత్మగా నున్నవాఁడు. ఎవ్వరు క్షేత్రజ్ఞుఁడైనపురుషుని క్షేత్ర మనుప్రకృతిని పైనఁజెప్పినప్రకారము తెలిసికొనుచున్నారో వారు స్వభావముతో వర్తించినను వారికిఁ బునర్జన్మములు లేవు. కొందఱు ధ్యాననిష్ఠులయి మనస్సుచేతఁ దమలో నంతర్గత మయినపరమాత్మను దర్శించుచున్నారు. మఱికొందఱు జ్ఞానయోగముచే మఱికొందఱు నిష్కామకర్మయోగముచే దర్శించుచున్నారు. నిఁకఁగొంతమంది పైనఁజెప్పినమార్గములచే నెఱుఁగక యాచార్యులవలన నుపదేశమును బొంది యుపాసనచేయుచున్నారు. వారు భక్తిశ్రద్ధలతో వేదాంతశ్రవణముఁ జేయువారు గనుక పునర్జన్మములు లేనివా రగుదురు. ప్రపంచమునందుఁ జరాచరవస్తువు లెన్నియుండుఁ బుట్టుచున్నవో యంతపర్యంతము క్షేత్రక్షేత్రజ్ఞు లైనప్రకృతిపురుషులకు రజ్జుసర్పభ్రాంతివలె సంసర్గము గలిగి యున్న దని తెలిసికొనుము. మాయారూపకమై నశింపఁగల ప్రపంచస్వరూపములయం దంతర్గతమై సమముగా వర్తించు పరమేశ్వరుని శాశ్వతుఁ డని యెవ్వరు తెలిసికొ

నుచున్నారో యట్టివారే తెలిసినవా రని చెప్పఁబడుదురు. అట్టివారు సమస్తప్రాణులయం దంతర్గత పరమాత్మ యొక్కటియే యని తెలిసికొనినవారు గనుక తమలో నంతర్గత మయినపరమాత్మను దుఃఖపెట్టరు. అందువలన వా రుత్కృష్టమోక్షముం బొందుచున్నారు. సకలకర్మలుఁ బ్రకృతిసంబంధ మయినగుణములవలనఁ జేయఁబడినవిగా నెవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో యతండు తనలో నంతర్గత మయిన క్షేత్రజ్ఞు నుపాధిరహితునిగాఁ దెలిసికొనినవాఁ డగుచున్నాఁడు. పృథక్స్వరూపములు గానుండు సమస్తభూతములు నాత్మయందున్నవిగా నాయొక్కయాత్మవలననే యీసమస్తప్రపంచము లుత్పత్తి నైనవిగా నెవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో యతఁడు పరబ్రహ్మస్వరూపుఁ డగుచున్నాఁడు. పరమాత్మ యనాదియై నాశరహితుఁడయి గుణరహితుఁడైనవాఁడు గనుక యట్టిపరమాత్మ దేహాంతర్గతుఁ డయ్యుఁగర్మలు చేయువాఁడు కాఁడు. కర్మఫలముల ననుభవించువాఁడును గాఁడు. ఆకాశము సూక్ష్మరూప మగుటవలన సర్వవ్యాపి యయ్యు వస్తువుల నెట్లంటదో యట్లే క్షేత్రజ్ఞుఁడైన పురుషుఁడు క్షేత్రము లయినశరీరములయం దుండియుఁ గర్మలకు సంబంధపడినవాఁడు కాఁడు. ఒక్కసూర్యుఁడు సమస్తజగత్తుల నేప్రకారము ప్రకాశింపఁజేయుచున్నాఁడో యారీతిగా క్షేత్రజ్ఞుఁ డనుపురుషుఁడు సమస్తక్షేత్రములను శరీరములను బ్రకాశింపఁజేయుచున్నాఁడు. పైప్రకారము క్షేత్రక్షేత్రజ్ఞుల భేదమును భూతములప్రకృతినివృత్త్యుపాయముల జ్ఞానదృష్టిచేఁ దెలిసికొనువారలు పరబ్రహ్మమును బొందుచున్నారు.

ఇట్లుపనిషద్రూప మయినట్టియుఁ బరబ్రహ్మవిద్య యయినట్టియు భగవద్గీత లనెడుశ్రీకృష్ణార్జునసంవాదరూప మయినయోగశాస్త్రమునందు క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగమను పదుమూఁడవ యధ్యాయము.



## ౧౪. గుణత్రయవిభాగయోగ మనుపదునాలుగవయధ్యాయము.

శ్రీకృష్ణమూర్తివారు చెప్పుచున్నారు. ఓయి యర్జున జ్ఞాన
ములోఁ బరమశ్రేష్ఠజ్ఞానమును మరలఁ జెప్పుచున్నాను. అట్టిజ్ఞానము
గలిగియే కదా సమస్తఋషులు మోక్షముంబొందిరి. యీజ్ఞానమును
బొంది నాతో సమానులయినవారు బ్రహ్మసృష్టికాలములోఁ గూడ
జన్మములను బొందరు. బ్రహ్మప్రళయకాలములోను దుఃఖమును
బొందరు. పరబ్రహ్మము నయిననాకుఁ బ్రకృతి యనునది భూతసృ
ష్టికారణముగా నున్నది. అట్టిప్రకృతియందు నాయంశము లుంచినవె
నుక సకలభూతప్రపంచములు నుత్పత్తి యగుచున్నవి. లోకములలో
నుద్భవించు సమస్తచరాచరభూతజాలములకుఁ బ్రకృతి తల్లివంటిది. ప
రబ్రహ్మస్వరూపి నయిననేను బీజము వేయుతండ్రిని. ప్రకృతివలననే
సత్వరజస్తమము లనుమూఁడుగుణములు గలిగినవి. ఆగుణములు ప్ర
కృతిసంబంధ మయినదేహమునం దంతర్గతుఁడుగా నాశరహితుఁడు
గా నుండెడువానిని బద్ధుని జేయుచున్నవి. ఆసత్వరజస్తమోగుణముల
లో సత్వగుణము స్వచ్ఛమయినది. నిర్మలముగాఁ బ్రకాశించునది;
యుపద్రవరహితమయినది. ఆసత్వగుణము క్షేత్రజ్ఞుని సుఖముగలవా
నిగా జ్ఞానముగలవానిగాఁ జేయుచున్నది. రజోగుణము కోరికలస్వరూ
పమయి ప్రాప్తమయిన విషయములయందుఁ బ్రీతి గలుగఁజేయుచున్న
ది. ఆగుణము దేహిని గర్మాసక్తి గలవానిఁ జేయుచున్నది. తమో
గుణ మజ్ఞానమువలనఁ బుట్టినది. అది సమస్తప్రాణులను మోహింపఁ
జేయుచున్నది. ఆగుణము దేహి నాలస్యముతో నిద్రతో నజాగ్రత్త
తోను బద్ధుని జేయుచున్నది. సత్వగుణము సుఖమునందుఁ బ్రవర్తిం
పఁజేయుచున్నది. రజోగుణము కర్మయందుఁ బ్రవర్తింపఁజేయుచు
న్నది. తమోగుణము జ్ఞానమును మఱుఁగు చేసి ప్రమాదకార్యముల
యందుఁ బ్రవర్తింపఁజేయుచున్నది. సత్వగుణము రజస్తమోగుణము
లను దిరస్కరించిన నది రూఢిగాఁ నిలుచును. రజోగుణము సత్వత
మోగుణములనుదిరస్కరించిన నది రూఢిగానిలుచును. తమోగుణము

సత్వరజోగుణములను దిరస్కరించిన నది యాధిగానిలుచును. ఎప్పుడీ దేహమునందు దేహద్వారము లయినజ్ఞానేంద్రియములద్వారా జ్ఞానస్వ రూపమైనయాత్మానాత్మవివేకము పుట్టుచున్నదో యప్పుడు సత్వగుణ ము ప్రబలమయిన దని తెలిసికొనుము. ఎపుడీదేహమునందు ద్రవ్యా కాంక్షయు సామాన్యచేష్టయుఁ గర్మాసక్తియు నింద్రియనిగ్రహము లేకపోవుటయు నిచ్ఛయుఁ గలుగుచున్నవో యప్పుడు రజోగుణము ప్ర బలమయిన దని తెలిసికొనుము. దేహమునం దవివేకము, జబ్బుతన ము నవకాశములేకపోవుట మోహమును గలిగినప్పుడు తమోగుణము ప్రబలమయిన దని తెలిసికొనుము. సత్వగుణము ప్రబలమయినదశ లో మరణము సంభవించినప్పుడు నిర్మలము లయినబ్రహ్మలోకాది లోకములఁ బొందుచున్నాఁడు. రజోగుణము ప్రబలమయినదశలో మ రణము సంభవించెనేని కర్మాసక్తి గలమనుష్యలోకమునందుఁ బుట్టు చున్నాఁడు. తమోగుణము ప్రబలమయినదశలో మరణము సంభవిం చిన శ్వానవరాహాది నికృష్టజన్మముల నెత్తుచున్నాఁడు. సత్వగుణ మువలనఁ బుట్టినకర్మకుఁ దేజోమయ మయినజ్ఞానము ఫల మనియు రజోగుణమువలనఁ బుట్టినకర్మకు దుఃఖప్రాప్తి ఫల మనియుఁ దమో గుణమువలనఁ బుట్టినకర్మ కజ్ఞానము ఫల మనియుఁ బెద్దలు వక్కా ణింతురు. సత్వగుణమువలన జ్ఞానము రజోగుణమున లోభము తమో గుణమునలన నేమఱుపాటు నజ్ఞానమును బుట్టుచున్నది. సత్వగుణము గలవారు దేవలోకాదిలోకములఁ బొందుచున్నారు. రజోగుణము గల వారు మనుష్యలోకమునందు మానవులుగాఁ బుట్టుచున్నారు. నికృష్ట వృత్తియం దున్నతమోగుణస్థులు పశ్వాదిజన్మములను నరకమును బొందుచున్నారు. గుణములేకర్త లనియుఁ దాను సాక్షీభూతుఁ డని యుఁ దెలిసికొనువాఁడు నాస్వరూపముఁ బొందుచున్నాఁడు. దేహో త్పత్తికిఁ గారణములయిన యీసత్వరజస్తమోగుణముల నతిక్రమించు వాఁడు జన్మమృత్యుజరాదుఃఖములచేత విడువఁబడి మోక్షమును బొం దుచున్నాఁడు. అర్జునుఁ డడుగుచున్నాఁడు. కృష్ణ ! యీసత్వరజస్త

మోగుణముల నతిక్రమించినవాని కే చిహ్నము లుండును? వాఁ డెట్టి యాచారములు గలవాఁడు? యీమూఁడుగుణముల నతిక్రమించుటకు మార్గ మెద్ది? శ్రీకృష్ణమూర్తివారు చెప్పుచున్నారు. త్రిగుణాతీతుఁడు ప్రకృతివలనఁ బుట్టినసత్వగుణసంప్రాప్త మయినజ్ఞాననిష్ఠ గలిగినప్పుటికి రజోగుణసంప్రాప్త మయినలోభకార్యము సంభవించెనా తమోగుణసంప్రాప్త మయినయజ్ఞానకార్యము జరగెనా ద్వేషింపఁడు. ఆయాకార్యము లాయాగుణములయం దణఁగి నివృత్తము లయినప్పుడు వానిం గోరఁడు. త్రిగుణాతీతుఁడు గుణములయందును గుణకార్యముల యందును లక్ష్యములేనివాఁడయి యుదాసీనుఁడుగా నుండును. జరగునట్టి సమస్తకార్యములుఁ ద్రిగుణవ్యాపారము లని తెలిసికొని తాను చలింపక యుండును. త్రిగుణాతీతుఁడు సుఖదుఃఖములను సమానముగాఁ జూచును. ఆత్మావలోకనము చేయును, మృత్పిండమును బాషాణమును బంగారమును సమముగాఁ జూచును. ప్రియాప్రియములయందు సమదృష్టి యుంచును. ధైర్యముగలవాఁ డగును. నిందాస్తుతుల యందు సమానుఁడుగా నుండును. త్రిగుణాతీతుఁడు మానావమానములయందు సమదృష్టి గలవాఁడగును. శత్రుమిత్రులయందు సమమనస్సుగలవాఁ డగును. సకలోద్యోగపరిత్యాగిగా నుండును. ఇట్లుండువాఁడె త్రిగుణాతీతుఁ డని చెప్పఁబడును. నన్న చంచలభక్తియోగముచేత సేవించువాఁడు త్రిగుణాతీతుఁడయి బ్రహ్మభాగముకొఱకు సమర్థుఁ డగుచున్నాఁడు. పరమాత్మయొక్క విగ్రహరూపమును శాశ్వత మయినమోక్షమున కాశ్రయమును నిత్యమయిన ధర్మమునకు మూలస్థానమును మోక్షసుఖమున కాశ్రయమును నేనే యని తెలిసికొనుము.

ఇట్లుపనిషద్రూప మయినట్టియుఁ బరబ్రహ్మవిద్య యయినట్టియు భగవద్గీత లనెడు శ్రీకృష్ణార్జునసంవాదరూప మయినయోగశాస్త్రమునందు **గుణత్రయవిభాగయోగమను** పదునాలుగవయధ్యాయము ముగిసెను.

౧౫. పురుషోత్తమప్రాప్తియోగ మనుపదేశవయధ్యాయము.

శ్రీకృష్ణమూర్తిగారు చెప్పుచున్నారు. మాయాశబలితబ్రహ్మమే మొదటి వేరుగా నికృష్టములయిన మహదహంకారములు కొమ్మలుగాఁ గలయశ్వత్థ మనుసంసారవృక్షము ననాది యని పెద్దలు చెప్పుదురు. అట్టివృక్షమునకు వేదములు కొమ్మలవంటివి. అట్టివృక్షస్వరూపముం దెలిసికొను వాఁడు వేదార్థములు తెలిసినవాఁ డగును. అట్టిసంసారవృక్షమున కవ్యక్తాదు లనుకొమ్మలు త్రిగుణములచేతఁ బోషింపఁబడి యూర్ధ్వముఖముగా నధోముఖముగా వ్యాపించియున్నవి. ఆకొమ్మలకు మనుష్యలోకమునందుఁ గర్మఫలములవలనఁ బుట్టిన రాగద్వేషాదులు క్రిందివేళ్ళుగాను శబ్దస్పర్శరూపరసగంధములు చిగుళ్ళుగా నున్నవి. సంసారవృక్షముయొక్క స్వరూపము తెలిసికొన శక్యము గాదు. దీనియాద్యంతములుఁగాని స్థితి గాని తెలియశక్యముగాదు. బహుదృఢములయిన వేళ్ళు గలయీసంసారవృక్షమును విరక్తియను నాయుధముచేఁ దెగఁగొట్టవలయును. అట్లు తెగఁగొట్టిన వెనుక నెవ్వానివలన ననాదియయిన సంసారప్రవృత్తి గలిగెనో యేవానిం బొందిన వారికి మరల జన్మములులేవో యట్టిపరమాత్మనే శరణుపొందుచున్నా నని ప్రయత్నము చేయవలయును. జ్ఞానులుమానమోహములు వదలి దారాపుత్రాదుల సాంగత్యములు విడిచి యధ్యాత్మజ్ఞానవిద్యాసక్తులయి కామక్రోధాదులు మాని శీతోష్ణాదిరూపము లయినద్వంద్వములయందు సమానులయి నాశరహితమయినమోక్షమును బొందుచున్నారు. అట్టియవ్యయపదమును సూర్యుఁడుగాని చంద్రుఁడుగాని యగ్నిహోత్రుఁడుగాని ప్రకాశింపఁజేయఁజాలరు. ఏయవ్యయపదమును బొందినవెనుక మరల జన్మములు లేవో యాపరమోత్కృష్ట మయినపదమే నాస్థాన మని తెలిసికొనుము. మఱియు ననాది యయిన నాయంశమే లోకమునందు జీవస్వరూపమయి యున్నది. ప్రకృతిసంబంధ మైనమనస్సుతోఁ గూడిన జ్ఞానేంద్రియము లాజీవునివిషయములయం దాకర్షించుచున్నవి. జీవుఁడు దేహములయందుఁ బ్రవేశించు

నప్పుడు ను దేహములను విడుచునప్పుడు ను వాయువు పుష్పాలవాసన ను దీసికొనిపోవుచందంబున నింద్రియములను వానితోఁగూడిన మన స్సును దీసికొనిపోవుచున్నాఁడు. జీవుఁడు జ్ఞానేంద్రియములయిన త్వ క్కు చక్షుస్సు శ్రోత్రము రసనము ఘ్రాణములను మనస్సును నంటి యింద్రియవిషయము లయినశబ్దస్పర్శరూపరసగంధముల ననుభవించు చున్నాఁడు. జ్ఞానశూన్యు లయినమూఢు లీజీవుని దేహము విడిచి పో వునప్పుడేమి దేహమునందు వసించి యుండునప్పుడేమి యింద్రియవిష యముల ననుభవించునప్పుడేమి గుణయుక్తుఁడుగా నుండునప్పుడేమి తె లిసికొనఁజాలరు. జ్ఞానదృష్టి గలవారు వీని నన్నిటిని జక్కఁగాఁజూచు చున్నారు. యోగులు తగినప్రయత్నములు చేయువారయి దేహాంతర్గ తుఁ డయినయాత్మస్వరూపజీవుని దెలిసికొనుచున్నారు. ఆత్మజ్ఞాన ము లేనియవివేకులు ప్రయత్నములు చేసియు నాత్మను జూడఁజాల రు. సూర్యునియందుఁ జంద్రునియందు నగ్నియందు నే తేజస్సంతగ్గ తమై సమస్తజగత్తులనుబ్రకాశింపఁజేయుచున్నదో యాతేజస్సు నాస బంధ మయినదని తెలిసికొనుము. నేను భూమియందుఁ బ్రవేశించి నాబలముచేతజీవకోట్లను ధరించుచున్నాఁడను. నేనే రసస్వరూపుఁడ గు చంద్రుఁడనై సమస్తౌషధులను బోషించుచున్నాను. దేహధారుల శరీరములయందుజఠరాగ్నిస్వరూపుఁడనయి ప్రాణాపానవాయువులతో గూడుకొని వారలు భుజించెడి నాలుగువిధములయిన భక్ష్యభోజ్యచో ష్యలేహ్యపదార్థములను జీర్ణముచేయుచున్నాను. సమస్తప్రాణులహృ దయములయందుఁ బ్రవేశించియున్నాను. నావలననే వారలకు స్మృ తి జ్ఞాన మాంద్యములు గలుగుచున్నవి. సమస్తవేదములచేతఁ దెలి యఁదగినవాఁడను వేదములు చేసినవాఁడను వేదములు తెలిసినవాఁడ ను నేనే. సమస్తలోకములయందు క్షరుఁడని యక్షరుఁ డని యిరువు రు గలరు. అందులో క్షరుఁ డనుపురుషుఁడు సమస్తదేహములే స్వరూ పముగాఁ గలవాఁడు ; అక్షరపురుషుఁడు కూటస్థుఁ డని పెద్దలు చెప్పు దురు. ఈపురుషులకంటె విలక్షణుఁడయిన పురుషుఁడు వేఱొకఁడు క

లఁడు. అతఁడే పరమాత్మ. అతఁడే స్వర్గమర్త్యపాతాళలోకముల యందుఁ బ్రవేశించి వానిని భరియించుచున్నాఁడు. అతఁడే నాశరహితుఁడయిన యీశ్వరుఁడు. నేను క్షరపురుషు నతిక్రమించి యక్షరపురుషునికంటె నుత్తముఁ డను గనుక లోకములయందును వేదములయందును బరమాత్మస్వరూపుఁ డయినపురుషోత్తముఁ డనిప్రసిద్ధి పొందియున్నాను. మోహవర్జితుఁడయి పైనఁజెప్పినప్రకారము పురుషోత్తముఁడ నయిన నన్నుఁ దెలిసికొను పురుషుఁడు సర్వజ్ఞుఁడయి సమస్తవిధములచేతను నన్నుఁ బొందుచున్నాఁడు. ఈపరమరహస్యశాస్త్రమును నీకు వివరించి చెప్పితిని. నేనువివరించినరీతిని దెలిసికొనిన వివేకులు బుద్ధిమంతులయి తాము చేయఁదగిన కర్మలను జేయుదురు.

ఇట్లుపనిషద్రూప మయినట్టియుఁ బరబ్రహ్మవిద్య యయినట్టియుఁ భగవద్గీత లనెడుశ్రీకృష్ణార్జునసంవాదరూప మయినయోగశాస్త్రమునందుఁ బురుషోత్తమప్రాప్తియోగ మనుపదేనవయధ్యాయము ముగిసెను.



౧౬. దైవాసురసంపద్విభాగయోగ మనుపదునాఱవయధ్యాయము.

శ్రీకృష్ణమూర్తివారు చెప్పుచున్నారు. భయములేక యుండుట చిత్తశుద్ధి జ్ఞానయోగమునం దుండుట దానములు చేయుట బాహ్యేంద్రియనిగ్రహము యజ్ఞములుచేయుట వేదాధ్యయనముచేయుట తపోనిష్ఠుఁడుగా నుండుట యథర్మము నందుఁ బ్రవేశింప కుండుట పరపీడావర్జనము సత్యము క్రోధము లేక యుండుట సర్వసంగపరిత్యాగము చిత్తోపశమము పరులయందు దోషము చెప్పకయుండుట సర్వప్రాణులయందు దయ విషయములు ప్రాప్తమయినప్పుడు వికారములు లేకయుండుట మృదుత్వము సిగ్గు చాపల్యము లేకయుండుట గాంభీర్యము గలిగియుండుట యోర్పు ధైర్యము శుద్ధి పరులకు ద్రోహము చేయకయుండుట గర్వము లేకయుండుట యీగుణము లన్నియు దేవాంశచే జన్మమెత్తిన మనుష్యులకుఁ గలుగుచున్నవి. డం

బము గర్వము నభిమానిత్వము క్రోధము నిష్ఠురవాక్కులుపలుకుట యవివేకము నీగుణములు రాక్షసాంశవలన జన్మమెత్తినవారలకుఁ గలుగుచున్నవి. దేవాంశలో జన్మమెత్తుట మోక్షప్రాప్తికి హేతువుగా నున్నది. అసురాంశలో జన్మమెత్తుట ప్రకృతిసంబంధ మయినజనన మరణములకు హేతువుగా నున్నది. దేవాంశలో జన్మమెత్తినవాఁడవు గనుక నీకు దుఃఖింపఁ బనిలేదు. లోకమునందుఁ బ్రాణులకు దేవాంశ మనియు నసురాంశ మనియు రెండువిధములయిన జన్మములు గలవు. అందులో దేవాంశజన్మగుణములు సవిస్తారముగా నీకుఁ జెప్పఁబడినవి. అసురాంశజన్మగుణములను సవిస్తారముగాఁ జెప్పుచున్నాను వినుము. అసురాంశజన్మము లెత్తినవారికి శ్రౌతస్మార్తకర్మప్రవృత్తి యిట్టిదనియుఁ గర్మనివృత్తి యిట్టిదనియుఁ దెలియదు. వారికంతర్బహిశ్శుద్ధి సదాచారము సత్యము నుండవు. అసురాంశజన్మము లెత్తినవారు సకలప్రపంచమును సత్యస్వరూప మని స్థాపించు వేదములను విశ్వసింపరు. వానియందు ధర్మాధర్మప్రతిష్ఠ లేదని వాదింతురు. జగత్తునకు నియామకుఁడయిన యీశ్వరుఁడు లేఁడని వాదింతురు. యావత్తులోకము స్త్రీపురుషసంబంధమువలననే కలిగిన దనియుఁ గామహేతువనియు మఱి యేమియు లేదనియు ను వక్కాణింతురు. ఇట్టియభిప్రాయము గలవారయి నష్టాత్ములయి యల్పబుద్ధిగలిగి హింసాదిక్రూరకర్మలు చేయుచు లోకమునకు శత్రువులయి లోకనాశముకొఱకుఁ బ్రయత్నములు చేయుదురు. అట్టివా రపరిమితమయిన కోరికలతో డంబ మాన మద యుక్తులయి నిషేధాదులను గోరుచు క్షుద్రదేవతల నారాధించి శాస్త్రవిరుద్ధ నియమములు గలిగి ప్రవర్తించుచుందురు. మఱియు మరణము నొందువఱకు నపరిమితమయిన చింత తోఁ గామభోగములే పరమార్థము లని నిశ్చయముగా నమ్మి ప్రవర్తించుచుందురు. అనేకవిధములయిన యాశాపాశములచేతఁ గట్టఁబడి కామక్రోధములచేత నిండి కామభోగార్థమై యన్యాయమార్గములచేత ద్రవ్యమును సంపాదింపఁ గోరుచున్నారు. మఱియు నట్టివా రిప్పు డింత

ద్రవ్యమును నేను సంపాదించితి నింక నింతిసంపాదింపఁబోవుచున్నా నిం తద్రవ్యము నాది యింకను నాయభీష్టములను బొందఁబోవుచున్నా నని తలంతురు. ఇప్పుడు నేనీశత్రువులను సంహరించితి నిఁక నితరశత్రువులఁ జంపఁగలను నేను నియామకుఁడను భోగిని సంపన్నుఁడను బలవంతుఁడను సుఖిని అని తలఁచుచున్నారు. ఇంతియ కాక నేను ధనవంతుఁడను సత్కులీనుఁడను నాతో సమానుఁడు లేఁడు నేను యజ్ఞములు చేసెదను, దానము లిచ్చెదను సంతోషించెద నని యివ్విధముగా నవివేకపుమాటలు వచించుచున్నారు. అట్టి దురాచారు లనేకవిషయములందాసక్తియుంచుటవలనఁ జిత్తవిభ్రాంతి నొంది మోహ మనువలచేతఁ జిట్టుకోఁబడి కామానుభవములయందు మునింగి ఘోరనరకముం బొందుచున్నారు. అట్టియవివేకులు తమ్ముఁదామే పొగడుకొని పెద్దల నిరాకరించి ధనమానమదములతోఁ గూడుకొని డంబముకొఱకై శాస్త్రిసమ్మతముగాని యజ్ఞములను జేయుచుందురు. అహంకారము బలము గర్వము కామము క్రోధము గలిగి సర్వాంతర్యామినైన నన్ను ద్వేషించి యితరులసద్గుణములను సహింపక వారియందు లేనితప్పులను జెప్పుదురు. నాకు ద్వేషులై క్రూరచిత్తము గలయట్టి యధములను నిరంతరము రాక్షసాంశమయిన నికృష్టజన్మముల నెత్తునట్లుగాఁ జేయుచున్నాను. అట్టి నికృష్టజన్మముల నొందెడు నవివేకులు నికృష్టజన్మముల నెత్తుచు జన్మజన్మమునకు నధోగతిని బొందుచునుందురే గాని నన్నెప్పటికిఁ బొందఁజాలరు. కామము క్రోధము లోభము నీమూఁడు నాత్మను నాశనము చేయునట్టివి. అవి నరకప్రాప్తికి హేతువు లగుచు గనుక యీమూఁడుగుణములను విడిచిపెట్టవలయును. పైన వివరించిన కామక్రోధలోభములను విడిచిపెట్టినవాఁడు తనయాత్మకు శ్రేయస్కరమై శాస్త్రిసమ్మతమయిన తపోయాగాదికర్మల నాచరించి మోక్షమునొందుచున్నాఁడు. శాస్త్రవిధి ననుసరింపక యిచ్ఛామార్గముగా నెవఁడు వర్తించునో యట్టివానికి సిద్ధిలేదు, సుఖములేదు, పరలోకప్రాప్తిలేదు గనుక శాస్త్రములను బ్రమాణము లని నమ్మి శా

స్త్రసమ్మతము లయినకర్మలను శాస్త్రబాహ్యములయిన కర్మలను తెలిసికొని శాస్త్రోక్త మయినకర్మలను నీవు చేయుము.

ఇట్లుపనిషద్రూప మయినట్టియుఁ బరబ్రహ్మవిద్య యయినట్టియుఁ భగవద్గీత లనెడుశ్రీకృష్ణార్జునసంవాదరూప మయినయోగశాస్త్రమునందు దైవాసురసంపద్విభాగయోగ మనుపదునాఱవయధ్యాయము ముగిసెను.



## ౧౭. శ్రద్ధాత్రయవిభాగయోగ మనుపదేడవయధ్యాయము.

అర్జునుఁ డడుగుచున్నాఁడు. ఓయికృష్ణా! శాస్త్రాచారము వదలి వృద్ధాచారసంప్రదాయ మయినపూజలు మొదలయినవి శ్రద్ధతోఁ జేయువానిగతి యే మగుచున్నది. అట్టి యాచారము సాత్త్వికమా? రాజసమా? తామసమా? శ్రీకృష్ణమూర్తివారు చెప్పుచున్నారు. దేహధారులకుఁ గలుగుశ్రద్ధ పూర్వజన్మవాసన ననుసరించి సాత్త్వికము రాజసము తామసము నని మూఁడువిధములుగా నున్నది. వానిని వివరించుచున్నాను వినుము. సమస్తప్రాణులకు వారివారిపూర్వజన్మములయందుఁ జేసిన కర్మఫలముల ననుసరించి శ్రద్ధ గలుగుచున్నది. ఆకారణమువలన జీవులకుఁ బైనవక్కాణించిన మూఁడుగుణములలో నేగుణము పట్టుపడుచున్నదో యాగుణముల ననుసరించిన శ్రద్ధగలుగుచున్నది. సత్వగుణనిష్ఠులు దేవతలను రజోగుణనిష్ఠులు రాక్షసులను దమోగుణనిష్ఠులయిన యితరులు ప్రేతభూతగణములను శ్రద్ధతోఁ బూజింతురు. డంబము నహంకారము గలిగి కామరాగబలములతోఁ గూడి యేమనుష్యులు శాస్త్రోక్తముగాని ఘోరతపస్సు చేయుచున్నారో యట్టియవివేకులు తమశరీరములయందున్న యింద్రియసమూహమును దత్కర్మసాక్షి నయిన నన్నుఁ గృశింపఁజేయుచున్నారు. అట్టి వారి నసురప్రకృతిసంభూతులనుగాఁ దెలియుము. సమస్తప్రాణులకు భోజనపదార్థములు గూడఁ బైఁజెప్పిన సాత్త్వికరాజస తామసగుణముల ననుసరించి యిష్టముగా నుండునవి. ఆప్రకారమే యజ్ఞము తప



స్సు దానముఁ ద్రిగుణాత్మకములుగా నున్నవి. వాని తారతమ్యముల ను వివరించెద వినుము. సత్వగుణవంతులు రసయుక్తము లయినట్టియు నెయ్యితోఁగూడినట్టియుఁ జిరకాలస్థాయు లయినట్టియుఁ బ్రియము లయినట్టియు నాయుస్సు సత్వము బలము నారోగ్యము ప్రీతి వృద్ధికరము లయినట్టి భోజనపదార్థములు నిష్టముతో నంగీకరింతురు. దుఃఖము శోకము రోగము గలుగఁజేయునట్టి మిక్కిలి చేఁదు పులుసు నుప్పుకలసి కారమయిన వేఁడిపదార్థములను రజోగుణవంతు లిష్టముతో నంగీకరింతురు. వంటచేసిన పిదప జాముకాలమై చల్లారినట్టియు సారములేనట్టియు దుర్గంధమైనట్టియు జల్లిదైనట్టియు భోజనానంతరము మిగిలినట్టియు నపవిత్రమైనట్టి పదార్థములను దమోగుణవంతులు ప్రీతితో నంగీకరింతురు. శాస్త్రవిధిచేత నియమితమైన యజ్ఞములను ఫలకాంక్ష లేక చేయుట యుచిత మని మనస్సునందు నిశ్చయించి యే యజ్ఞములు చేయఁబడుచున్నవో యవి సత్వగుణప్రధానము లని తెలిసికొనుము. ఫలము నుద్దేశించి కాని ప్రతిష్ఠకొఱకుఁ గాని చేయఁబడు యజ్ఞములు రజోగుణప్రధానమైనవని తెలిసికొనుము. శాస్త్రసమ్మతము గానట్టియు నన్నదానము లేనట్టియు మంత్రలోపమైనట్టియు శాస్త్రోక్తదక్షిణ లేనట్టియు శ్రద్ధలేక చేయఁబడినయజ్ఞములు తమోగుణప్రధానము లని తెలిసికొనుము. దేవతలను బ్రాహ్మణులను గురువులను బెద్దలను బూజించుటయు శుచి కిల్బిషములేనితనము నిషిద్ధస్త్రీగమనవర్జనము నితరప్రాణుల కుపద్రవము చేయకయుండుటయివి యన్నియు శరీరప్రధానములైన తపస్సు లని చెప్పఁబడుచున్నవి. ఇతరప్రాణులకు మనస్సు నొప్పింపని ప్రీతి విశ్వాసములతోఁ గూడిన యథార్థపు మాటలును వేదాభ్యాసము చేయుటయు వాగ్రూపమైన తపస్సు లని చెప్పఁబడును. మనస్సునకుఁ దృప్తిదమైన మంచివృత్తియు మితభాషిత్వము మనోనిగ్రహము మనశ్శుద్ధి మనస్సంబంధమైన తపస్సు లని చెప్పఁబడును. ఫలకాంక్షలేక యుత్కృష్టమైనశ్రద్ధతో యోగులు చేయునట్టి పయినవివరించిన మూఁడువిధములైన శరీరవా

స్త్రసమ్మతపస్సులు సత్వగుణప్రధాన మైనవని పెద్దలు చెప్పుదురు. ఇతరులవలనఁ బూజింపఁబడుటకు గౌరవముకొఱకు డంబముకొఱకుఁ జేయు తపస్సు రజోగుణసంబంధ మనియు నశింపఁదగ్గ దనియుఁ జంచలమైన దనియుఁ బెద్దలు చెప్పుదురు. తనకు దుఃఖకరమై యితరప్రాణులకు హింసాస్పదమై దురాగ్రహముచేతఁ జేయఁబడిన తపస్సు తమోగుణసంబంధ మైనదని పెద్దలు చెప్పుదురు. దానము చేయుటయవశ్య మని యెంచి దేశకాలపాత్రముల నెఱింగి ప్రత్యుపకారము చేయలేని పురుషుల కిచ్చుదానము సత్వగుణప్రధానముగలది. ఫలము నుద్దేశించి ప్రత్యుపకారము నుద్దేశించి మనస్సు నొచ్చుకొనుచు నివ్వఁబడిన దానము రాజసగుణప్రధాన మైనది. నికృష్ట దేశకాలపాత్రములయందుఁ దిరస్కారావమానములతోఁ గూడి చేయఁబడినదానము తామసగుణప్రధానమగునది. పరబ్రహ్మనామోచ్చారణము ఓం తత్ సత్ అని మూఁడుప్రకారములుగాఁ జెప్పఁబడెను. అట్టి పరబ్రహ్మముచేతఁ బూర్వకాలమునందు బ్రాహ్మణులు వేదములు యజ్ఞములు నిర్మింపఁబడినవి. ఆకారణమువలన శాస్త్రోక్తములైన యజ్ఞదానతపస్సులను క్రియలను బ్రహ్మవాదులు ప్రారంభించినప్పుడు ఓంకారమును మొదటనుచ్చరించుచున్నారు. మోక్షకాంక్ష గలిగినవారలచేత తత్ అను పరమాత్మస్వరూపనిర్దేశక మైనశబ్ద ముచ్చరింపఁబడి యజ్ఞదానతపఃక్రియలు ఫలకాంక్షలేకయే ప్రారంభింపఁబడును. సత్ అనుశబ్దము శ్లాఘనీయమైన వానిని శ్రేష్ఠమయినవానిని దెలియఁజేయుటకు సంజ్ఞగానున్నది. ఆకారణమువలనఁ బ్రశస్తమయిన కర్మలయందు సత్ శబ్దము ప్రయోగింపఁబడుచున్నది. యజ్ఞదానతపస్సులయందుఁ గల నిష్ఠ సత్ అనిచెప్పఁబడును. భగవత్ప్రీతిగాఁ జేయఁబడినకర్మలు యావత్తు సత్ అని చెప్పఁబడుచున్నవి. శ్రద్ధలేని హోమములు దానములుఁ దపస్సులు అసత్ అని చెప్పఁబడుచున్నవి. అవి యిహమునకును బరమునకును సౌఖ్యకరములు గావు.

ఇ త్యుపనిషద్రూప మయినట్టియుఁ బరబ్రహ్మవిద్య యయిన ట్టియు భగవద్గీత లనెడుశ్రీకృష్ణార్జునసంవాదరూప మయినయోగశాస్త్రమునందు శ్రద్ధాత్రయవిభగయోగమను పదునేడవయధ్యాయము ముగిసెను.



౧౮ మోక్షసన్న్యాసయోగ మనుపదునెనిమిదవయధ్యాయము.

అర్జునుఁడడుగుచున్నాఁడు. కృష్ణ! సన్న్యాసముయొక్క త్యాగముయొక్క తత్వములను వేర్వేరుగాఁ దెలియఁగోరుచున్నాను. దయచేసి సెలవిమ్ము. శ్రీకృష్ణమూర్తి వారు చెప్పుచున్నారు. అర్జున! జ్యోతిష్టోమాదికామ్యకర్మత్యాగము సన్న్యాస మనియు వేదోక్తములైన సమస్తకర్మల నాచరించి యాకర్మఫలముల నీశ్వరార్పణము చేయుట త్యాగ మనియుఁ జెప్పుదురు. కొందఱు పెద్దలు సమస్తకర్మలను దోషము గలవిగా నెంచి సన్న్యసింపవలయునని చెప్పుదురు. మఱికొందఱు వేదోక్తము లైన యజ్ఞదానతపస్సులను కర్మలను విడువఁగూడదని చెప్పుదురు. కర్మత్యాగ మనియుఁ గర్మఫలత్యాగ మనియుఁ జెప్పంబడు నీరెండుమార్గములలో నాయభిప్రాయము వినుము. త్యాగము మూఁడువిధము లని చెప్పఁబడియున్నది. యజ్ఞదాన తపోరూపమయిన కర్మ యవశ్యము చేయఁదగినది. అది విడువఁదగినది కాదు. ఎందువలన ననఁగా:- యజ్ఞదానతపఃకర్మలు పండితులకుఁ బవిత్రములైనవి. పైనఁజెప్పిన మూఁడువిధములైన యజ్ఞదానతపఃకర్మలను ఫలకాంక్షలు విడిచిపెట్టి చేయువలయును. ఇది నానిశ్చయమయిన పరమోత్తమాభిప్రాయము. వేదోక్తము లైన నిత్యనైమిత్తికకర్మలను విడిచిపెట్టఁగూడదు. అజ్ఞానముచే విడిచిపెట్టుట తామసత్యాగ మని తెలిసికొనుము. దేహమునకుఁ గష్టము కలుగునని భయపడి ప్రయాసయిచ్చెడికర్మల నెవఁడు విడిచిపెట్టుచున్నాఁడో వాఁడురాజసత్యాగముచేసినవాఁ డగును. కనుక కర్మఫలత్యాగమునలనఁ బ్రాప్త మయ్యెడి మోక్షము వానికి సిద్ధింపదు. ఆసక్తిని ఫలములను విడిచిపెట్టి వేదోక్త

గ్రహము లేక బుద్ధిహీనుఁడు స్తబ్ధుఁడు మాయావియునై పరుల కవమా
నముఁ జేయుస్వభావముగలిగి మందుఁడయి దుఃఖశీలుఁడయి యాలస్య
ముతోఁ గర్మ జేయుకర్త తామసుఁ డని చెప్పఁబడును. బుద్ధియు ధై
ర్యము గుణభేదమువలన మూఁడుమూఁడువిధములయి యున్నయవి.
వాని నిస్సంశయముగా వేర్వేఱుపఱచి నీకుఁ జెప్పెద వినుము. కర్మ
మార్గమును మోక్షమార్గమును గర్తవ్యాకర్తవ్యములను భ
యాభయములను బంధమోక్షములను నేబుద్ధి తెలిసికొనుచున్నదో
యది సత్వగుణమువలనఁ గలిగిన దని తెలిసికొనుము. ధర్మాధర్మవి
చారముయొక్కయుఁ గార్యాకార్యములయొక్కయు యథార్థతను దెలి
యనేరని బుద్ధి రజోగుణమువలనఁ గలిగిన దని తెలియుము. అజ్ఞాన
ముచేతఁ గప్పఁబడి నిషిద్ధధర్మములను శాస్త్రసమ్మతములయినవని
యు సమస్తపదార్థములను వ్యత్యస్తములుగాఁ దలఁచుబుద్ధి తామస
గుణమువలనఁ గలిగిన దని తెలిసికొనుము. మనఃప్రాణేంద్రియముల
వ్యాపారములను దృఢమయిన యోగముతో నియమించు వానిధై
ర్యము సాత్వికధైర్య మనఁబడును. ఫలకాంక్షగలిగి యాసక్తితో ధర్మా
ర్థ కామములను సర్వదా కోరువానిధైర్యము రాజసధైర్యము, కుత్సిత
బుద్ధి గలపురుషుఁ డేధైర్యముచేత నిద్రను భయమును దుఃఖమును ది
గులును మదమును విడువఁడో యట్టివానిధైర్యము తామసధైర్యము.
సుఖముమ గుణసంబంధము గలిగి మూఁడువిధములుగా నున్నయది.
వానిని వివరించుచున్నాను వినుము. ఏసుఖానుభవమునం దభ్యాసము
వలనఁ గ్రీడించుచున్నాఁడో యేసుఖము దుఃఖనాశముఁ గలుగఁజేయు
నో యేసుఖము ప్రారంభములో విషమువలె నుండి యంతమునం ద
మృత తుల్యముగానుండు నో యట్టితన బుద్ధినైర్మల్యమువలనఁ బుట్టి
నసుఖము సాత్వికసుఖ మని చెప్పఁబడును. విషయేంద్రియసంబంధము
వలనఁ గలిగి మొదట నమృతముగాను గడపట విషముగాను నుండు
సుఖము రాజససుఖము. నిద్రవలనను నాలస్యమువలన నెచ్చరికలేమి
ని గలిగెడిసుఖము ప్రారంభమున సంత్యమున నాత్మకు భ్రాంతిం బు

ట్టించును. అట్టిసుఖము తామససుఖమని పరిగణింతురు. ప్రకృతివల
నఁ బుట్టిన యీసత్త్వరజస్తమోగుణములకు లోఁబడనిప్రాణి మనుష్య
లోకములోఁ గాని దేవలోకములోఁ గాని పాతాళలోకములోఁ గాని
లేదు. బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రజాతులకు శాస్త్రోక్తమయిన కర్మ
లు వారివారిప్రకృతివలనఁ బుట్టిన సత్త్వరజస్తమోగుణముల ననుసరించి
యేర్పఱుపఁబడియున్నవి. అంతరింద్రియనిగ్రహము బహిరింద్రియనిగ్ర
హముఁ దపస్సు శుచిత్వము ఓర్పు నిర్వక్రత్వము శాస్త్రీయజ్ఞానము న
నుభవజ్ఞానము నీశ్వరుఁడు కలఁడనునమ్మిక యివి యన్నియు బ్రా
హ్మణులకు స్వభావమువలనఁబుట్టిన కర్మలు. శూరత్వము తేజస్సు ధై
ర్యము సామర్థ్యము యుద్ధమునందుఁ బాఱిపోకుండుట దానము ప్ర
భుత్వము నివి క్షత్రియులకు స్వభావమువలన బుట్టినకర్మలు. భూమిని
దున్నుట గోసంరక్షణచేయుట వ్యాపారము చేయుట వైశ్యులకు స్వ
భావమువలనఁ బుట్టినకర్మలు. సేవచేయుట శూద్రులకు స్వభావ
ము వలనఁ బుట్టినకర్మ. మానవులు తమతమ జాతిధర్మకర్మలయం
దాసక్తిగలిగి యేప్రకారము సిద్ధిని బొందుచున్నారో యాక్రమ
మును దెలియఁ జెప్పుచున్నాను వినుము. ఏయీశ్వరునివలన సమ
స్తజగత్తులుఁ బుట్టుచున్నవో యెవ్వనివలన సమస్తజగత్తులు వ్యాపింపఁ
బడి యున్నవో యట్టియీశ్వరుని మానవులు తమతమ స్వకీయకర్మా
నుష్ఠానములచేతఁ బూజించి సిద్ధిని బొందుచున్నారు. తమకులధర్మము
లు సర్వగుణములగల వైనను విశేషగుణము గలిగి చక్కఁగా ననుష్ఠిం
పఁబడిన పరధర్మములకంటె శ్రేష్ఠమైన వని తెలిసికొనుము. తమత
మ కులధర్మముల నాచరించు జనులను పాపములు చెందవు. దోష
యుక్తమయినను స్వభావజన్యములైన కులధర్మములను విడువఁగూడ
దు. అగ్నిని బొగ కప్పినరీతిగా సమస్తకర్మలను దోషము చుట్టుకొని
యున్నది. సమస్తప్రపంచమునందు నాశవిడిచి మనస్సును స్వాధీనము
చేసికొని సకలాశలను వదలి కర్మఫలత్యాగముచేయువాఁ డుత్కృ
ష్టమయిన నైష్కర్మ్యసిద్ధిని బొందుచున్నాఁడు. నైష్కర్మ్యసిద్ధినిబొందిన
వెనుక పరబ్రహ్మమును బొందుటకు మార్గమైన పరమోత్కృష్టమ

యిన జ్ఞాననిష్ఠను నీకు సంక్షేపముగాఁ దెలియఁజెప్పెదను వినుము. మాయారహిత బుద్ధిని జేకొని ధైర్యముతో మనస్సును నియమములో నిలిపి శబ్దస్పర్శరూపరసగంధవిషయములను బాఱఁద్రోచి రాగద్వేష ములను విడువవలయును. ఇంతియకాదు రహస్యస్థలమునందు వాస ము చేయుచు మితభోజనము చేయుచు వాక్కును మనస్సును దేహ మును నియమములో నిలిపి యెల్లప్పుడు ధ్యానయోగమునం దాసక్తుఁ డై వైరాగ్యమును బొంది యహంకారమును సామర్థ్యమును దర్పము ను గామమును గ్రోధమును గృహదారాదుల యందాసక్తిని మమకా రమును దురాగ్రహమును విడిచి యుండు జ్ఞాననిష్ఠుఁడు పరబ్రహ్మ భావమును బొందుటకు సమర్థుఁ డగుచున్నాఁడు. బ్రహ్మనిష్ఠుఁడు నిర్మలమనస్సుతో నష్ట వస్తువులకు దుఃఖింపక రానివస్తువులను గోరక సమస్తప్రాణులయందు సమదృష్టి గలిగి పరమోత్కృష్టుఁడ నైననా యందు భక్తి చేయుచుండును. సర్వవ్యాపిగా సచ్చిదానందవిగ్రహుఁడ గానుండు నన్ను పరమభక్తిచేతఁ దెలిసికొనినవాఁ డట్టిజ్ఞానపరిసమాప్తి కాలమునందు నన్నే పొందుచున్నాఁడు. నన్నే ప్రాప్యస్థానముగా నెం చి వేదోక్తసమస్తనిత్య నైమిత్తికకర్మలను జేయువాఁడు నాయనుగ్ర హమువలన నాశరహితమోక్షము నొందుచున్నాఁడు గనుక నీవు బు ద్ధియోగముచేత సకలకర్మఫలములను నాకు సమర్పణముచేసి నన్నే యుత్కృష్టగతియని నమ్మి బుద్ధియోగముచేత సమస్తకాలములయం దు నాయందే మనస్సునిలిపి యుండుము. నీమనస్సు నాయందులయిం చినట్లైన నాయనుగ్రహమువలననీకు సమస్తదుఃఖములు తొలఁగిపోవు ను, లేక యహంకారమునుబొంది నావాక్యములను వినకపోయితివేని నశించిపోదువు. నీవహంకారమునొంది యుద్ధము నెంతమాత్రము చే య నని నిశ్చయించితివేని యట్టి నీనిశ్చయము వ్యర్థమై పోవును. నీ ప్రకృతిసంభవము లైనగుణములు నీచేత యుద్ధము చేయించును. స్వ భావజన్యగుణములకు లోపడిననీవెట్టికర్మ చేయఁగూడ దని యవివేక ము చేత నిశ్చయించుచున్నావో యట్టికర్మను నీకుఁ దెలియకయే నీ స్వభావగుణము నిన్నుఁ బరవశుని జేసి నీచేతఁ జేయించును. సమస్త

భూతములకు నియామకుఁడైన యీశ్వరుఁడు సకలప్రాణులహృదయము లయం దున్నవాఁడై జంత్రిగాఁడు బొమ్మల నాడించురీతిగా మాయ చేతఁబ్రాణులను భ్రమింపఁజేయుచున్నాఁడు. కనుక పైనఁజెప్పిన యీశ్వరునే సర్వభావములయందు శరణుపొందుము. ఆయీశ్వరానుగ్రహమువలన నుత్కృష్టమయిన చిత్తశాంతి గలిగి నిత్యమయిన మోక్షమును జెందఁగలవు. ఈప్రకారము నీకొఱకు రహస్యములలోఁ బరమ రహస్య మయిన జ్ఞానమును దెలియఁజెప్పితిని. దానిని వివరముగా దూజించి నీయిష్టప్రకారము చేయుము. నీవు నాకుఁ బరమప్రియుఁడవు గనుక నీక్షేమముకొఱకై మఱియొకపరమరహస్యమయిన యుత్కృష్టవాక్యముం జెప్పుచున్నాను, నాయందు నీమనస్సును నిలుపుము. నాయందు భక్తి సలుపుము. నన్నుఁ బూజింపుము. నాకు నమస్కారము చేయుము. అట్లు చేసితి వేని నీవు మోక్షమును జెందఁగలవు. నీవు నాకుఁ బ్రియుఁడవు నీకు సత్యమును దెలియఁజేసితి నని ప్రతిజ్ఞ చేయుచున్నాను. నీవు సమస్తకర్మఫలములను నా కర్పణముచేసి యన్యదేవతాభజనంబు మాని నన్నొక్కనినే శరణుపొందుము నిన్ను సమస్తపాపములనుండి విముక్తుని జేయుచున్నాను, నీవు దుఃఖింపకుము. నీకు జ్ఞానము గలుగుటకై నేను జెప్పినయీగీతాశాస్త్రమును దపస్సుచేయని వానికిని భక్తిలేనివానికి శ్రద్ధలేనివానికి నాయం దసూయ గలవానికి నుపదేశింపఁ దగినది గాదు. ఎవ్వఁడు పరమోత్కృష్టమయి పరమరహస్యమయిన యీగీతాశాస్త్రమును నాభక్తుల కుపదేశము చేయుచున్నాఁడో వాఁడు నాయందుఁ బరమభక్తిని జేసినాస్థానమయిన మోక్షమును జెందఁగలఁడు. అట్లుపదేశము చేయువానికంటె మనుష్యులలో నాకుఁ బరమప్రియము చేయువాఁడు వేఱొకఁడు లేఁడు. భవిష్యత్కాలములోను వానికంటెఁ బ్రియుఁడు భూలోకమునందు నాకుఁ గలుగఁడు. మన సంవాదరూపమయిన మిక్కిలిబలముగల యీగీతాశాస్త్రము నెవ్వఁడు ప్రతిదినమునందుఁ బారాయణము చేయుచున్నాఁడో వాఁడు జ్ఞానయోగముచేతనన్నుఁ బూజించినవాఁడనినాయభిప్రాయము. అసూయలేక భక్తిశ్రద్ధలతో నీగీతాశాస్త్రమునువినుపురుషుఁ

డుపాపములు నశింపఁజేసికొని పుణ్యకర్ములు గలపూరుషుల యుత్కృష్ట లోకమును బొందుచున్నాఁడు. నాచేతఁ జెప్పఁబడినపరమగోప్య మగు నీగీతాశాస్త్రము నేకాగ్రచిత్తుఁడవై చక్కఁగా వింటివిగదా నీయజ్ఞానజన్యమగు నవివేకము తొలంగిపోయినదిగదా? నాతోఁ జెప్పుము. అర్జునుఁడు పలుకుచున్నాఁడు. అచ్యుత నీయనుగ్రహమువలన నాయవివేకము తొలంగిపోయెను. జ్ఞానము సిద్ధించెను. సందేహము నివర్తించెను. నీయాజ్ఞను శిరసావహించుటకు సిద్ధముగానున్నాను. సంజయుఁడు చెప్పుచున్నాఁడు. ధృతరాష్ట్రమహారాజా! అద్భుతమయినట్టియుఁ బులకాంకురముగలుగఁజేయునట్టియు శ్రీకృష్ణార్జునుల సంవాదరూపమయిన గీతాశాస్త్రమును నేనువింటిని. యోగీశ్వరుండగు శ్రీకృష్ణుఁడు సాక్షాత్కారముగాఁ జెప్పిన పరమోత్కృష్టమైన యీగోప్యయోగశాస్త్రమును శ్రీవేదవ్యాసుల యనుగ్రహమువలనవింటిని. అద్భుతమైనట్టియుఁ బవిత్రమైనట్టియుఁ గృష్ణార్జునుల సంవాదమునుఁ దలఁచితలఁచి మాటిమాటికి నుప్పొంగుచున్నాను. శ్రీకృష్ణులయొక్క యద్భుతమైన విశ్వరూపమును లెస్సగా ధ్యానముచేయఁగాఁ జేయఁగానాకధికాశ్చర్యము తోఁచితోఁచి మాటిమాటికి దేహము పులకాంకిత మగుచున్నది. ఎచ్చట యోగయోగీశ్వరుఁడైనఁ శ్రీకృష్ణులు ధనుర్ధరుఁడైన యర్జునుఁడు నున్నారో యచ్చట సంపద జయము నైశ్వర్యము స్థిరమైన నీతి యున్నవని నాయభిప్రాయము.

ఇట్లు లక్షసంఖ్యగల శ్రీమహాభారతములో భీష్మపర్వమునం దుపనిషద్రూపమైనట్టియుఁ బరబ్రహ్మవిద్యయైనట్టియు భగవద్గీతలనెడి శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన యోగశాస్త్రమునందు మోక్షసన్న్యాసయోగ మనుపదునెనిమిదవయధ్యాయము ముగిసెను.

“ వసుదేవ తనూజాయ నీలాంబుదనిభాయచ
పాండవానుగ్రహకృతే శ్రీకృష్ణాయనమోనమః.”
శ్రీకృష్ణార్పణమస్తు.



మంగు వెంకటరంగనాథరావు బుక్కుసెల్లర్ కాకినాడ.

